

శ్రీమతే రామానుజాయనమః.

# తప్త చక్రాంకన ప్రమాణముల యొక్క విషయసూచిక

## శ్రుతిప్రమాణములు



## స్మృతిప్రమాణములు



## పాంచరాత్రాగమములు



## వైఖానసాగమము



## ఇతిహాస - పురాణములు ఇత్యాదులు

శ్రీ
శ్రీమతే రామానుజాయనమః



# తప్తచక్రాంకన ప్రమాణములు

## ప్రస్తావన.

ముముక్షువులైనను మోక్షమును పొందవలెనన్నచో పంచసంస్కార సంపన్నులు కావలయును. సంస్కార మనగా కార్యాంతరయోగ్యతాకరణత్వం. అనగా యిప్పుడున్న స్థితికంటెను ఉన్నతమైన స్థితిని పొందుటకు వలయు యోగ్యతను కలుగజేయుట అని తాత్పర్యము. ముముక్షువులైనవారికి పొందతగిన ఉన్నతస్థితి యేది యనగా— యికముందెట్టి కర్మానుభవమును జనించనవకాశము లేకుండచలెను. మరియు యిప్పటికున్న కర్మయంతయును సమూలముగ నశించవలయును. మరియు నిత్య—నిరవచ్ఛిన్న—నిరతిశయ—నిరుపాధిక— నిరవధిక ఆనందము కలుగవలెను ఇవన్నియు ఒకే వ్యక్తికి ఒకే దేశమున ఒకే కాలమున తటస్థించవలెను. అట్టి స్థితియే మోక్షమనియనబడును.

అట్టి స్థితినిపొందుటకై తాపము—పుండ్రము—నామము—మంత్రము యాగము అను అయిదు సంస్కారములు ఆవశ్యకములై యున్నవి.

ఈ పంచ సంస్కారములు కేవలము అలౌకిక పురుషార్థమును మాత్రమే గాక అనేక లౌకిక పురుషార్థములను కూడా లభింపజేయునవై యున్నవి.

అందులో 'తాపసంస్కార' మనగా శ్రీమన్నారాయణుని యొక్క అసాధారణచిహ్నములగు శంఖ—చక్రములను విధ్యుక్తముగ అగ్నితప్తములు గావించి రెండు బాహుమూలములయందును ధరించుటయై యున్నది

ఇందులకై శ్రుతి—స్మృతి—సూత్ర—ఇతిహాస—పురాణ—ఆగమాది ప్రమాణము లనేకములు గలవు అందలి కొన్ని ప్రమాణములు ఈ చిన్న పుస్తకమునందు తెలుపబడినవి. ఇవిగాక యింకను ఎన్నియో ప్రమాణములు గలవు. అవకాశమున్నపుడు వాని నన్నిటిని ముందు ముందు తెలుపగలము.

మరియు యిందులకు ఎన్నియో ప్రత్యక్ష ప్రమాణములు— అనుభవములు— యుక్తులును కూడ గలవు

తన యధికారులయొక్క అసాధారణ చిహ్నములను ధరించుటవలననేగదా శుద్ధాసవర్గము కూడ ఆయా యధికార పదవులను తదనుగుణ శక్తి—సామర్థ్యములను, గౌరవ—మర్యాదలను కలదై యున్నది.

శంఖ చక్ర చిహ్న ధారణమాత్రముచేతనేగదా సాధారణమైన పశువుకూడ దేవత్వమును చెందినదిగా పూజింపబడుచున్నది

చిన్న సాధారణ కాగితపు ముక్కకూడ ప్రభుత్వ ముద్రను ధరించుటవలననేగదా ధన రూపమై- విలువగలదై వెలయుచున్నది

నిర్జీవస్థితిలో నున్న వారలే, పశువులే, అచేతన ద్రవ్యములే ఇట్టి ప్రభుత్వముద్రధారణముచే యింత పవిత్రత- ప్రతిభ- ప్రభావము- ఉన్నతపదమును పొందుచున్నప్పుడు లోకైక ప్రభువగు శ్రీమన్నారాయణుని అసాధారణ చిహ్నములను వివ్యక్తముగా ధరించువారలకు కలుగు పవిత్రత- ప్రతిభ- ప్రభావము- ఉన్నతస్థితులను గురించి వేరే ప్రస్తావింపనేల ?

తప్తచక్రాంకనపరుడైనవాడు మిగత నాలుగు సంస్కారములనుకూడ లభించుకున్నవాడై తదనుగుణమైన జ్ఞానానుష్ఠానములను గలవాడు గావలెను శ్లో॥ యే కంఠలగ్నతులసీ నలినాక్షమాలాః, యే బాహుమూలపరిచిహ్నిత శంఖచక్రాః । యే వా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః తే వైష్ణవాః భువన మాశు పవిత్రయంతి ॥ అని ఎవరు కంఠమున తులసీ- తామరపూసలమాలికలను- భుజములయందు శంఖ-చక్ర చిహ్నములను, ముఖమున శ్వేతోర్ధ్వపుండ్రమును ధరించియుందురో అట్టివారు వైష్ణవులనబడుదురు వారివలననే భువనము పవిత్రవంత మగుచున్నది అని తెలుపబడిన శ్రీవైష్ణవులనుజూచి, శ్లో॥ స్వపురుష మభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య కర్ణమూలే, పరిహర మధుసూధన ప్రపన్నాన్, ప్రభు రహ మన్యనృణాం న వైష్ణవానాం॥అని యముడు తన భటులతో తాను శ్రీవైష్ణవేతరులకేప్రభువుగాని శ్రీవైష్ణవులకు ప్రభువును గానని యు కావున వారి దరికైనను పోవలదని రహస్యముగ చెవిలో, పాశహస్తులై యున్న తన భటుల నాజ్ఞాపించినటుల శ్రీ పద్మపురాణమునందున్నది.

అట్టి శ్రీవైష్ణవుడు ఈ జన్మాంతమునందే తప్పక మోక్షమును పొందగలడు లేక కేవలము తప్తచక్రాంకనపరుడు మాత్రమే అయి, తదనుగుణమైన జ్ఞానానుష్ఠానములు లేనివాడైనచో, యిపుడున్న జన్మకంటెను ఉత్కృష్టమైన ఉన్నతజన్మనే పొందుచు క్రమముగ జ్ఞానానుష్ఠానములుకూడ అలవరచుకున్నవాడై కొన్ని జన్మముల యనంతరమందైనను తప్పక మోక్షమును పొందితీరును అంతియెగాని, ఎట్టి స్థితిలోను కూడ ఇంతకంటె నీచజన్మమును-నీచస్థితిని మాత్రము పొందడు ఇది నిశ్చయము.

చతుర్ముఖబ్రహ్మ- రుద్రుడు- ఇంద్రుడు- దేవతలు- వశిష్ఠుడు- పరాశరుడు- వ్యాసుడు- వాల్మీకి- అగస్త్యుడు- అత్రి- సనత్కుమారుడు- నారదుడు- మార్కండేయుడు- వైఖానసుడు మున్నగు దేవతలు- ఋషులు- మునులు- ఆళ్వార్లు- ఆచార్యులు అందరు తప్తచక్రాంకన పరులైనటుల ప్రమాణములు తెలుపుచున్నవి.

గనుకనే వేదమార్గప్రవర్తకులగు ద్వైత- అద్వైత- వైష్ణవ విశిష్టాద్వైత సంప్రదాయస్థులగు వర్ణాశ్రమ వైదికజాతీయులలోను ద్వైతులున్ను- విశిష్టాద్వైతులున్ను పూర్తిగను, మరియు అద్వైతులలో సత్యకూటస్థులు అనువారున్ను మరియు పాంచరాత్రదీక్షితులున్ను కూడ, అనగా మూడింట రెండువంతుల మంది తప్తచక్రాంకనపరులుగనే యున్నారు

ఉపనయన సంస్కారము ద్విజత్వమును కలిగింపజేసినటులనే, ఈ తప్తచక్రాంకణాది పంచసంస్కారము శరీరమునకును ఆత్మకును కూడ సంబంధించినదై దేహాత్మలకు పవిత్ర పారి

శుద్ధ్యములను కలిగింపజేసి, ప్రణవవిశిష్ట- వైదిక నారాయణాష్టాక్షరి మహామంత్రోపదేశ- ఉపాసనలకర్హులుగ జేయుచున్నది మరియు ఈ సంస్కారము అన్నివిధములైన సాంసారిక దురితములకును, అన్నివిధములైన కర్మబంధములకును ప్రాయశ్చిత్తరూపమైనదై అందరిని పునీతులుగను పవిత్రులుగను జేయునదై యున్నది

గనుక భుభుక్షువులేగాని ముముక్షువులేగాని
లౌకికపురుషార్థకాంక్షులేగాని అలౌకికనిశ్రేయోభిలాషులేగాని
స్త్రీలేగాని పురుషులేగాని
బ్రాహ్మణులేగాని బ్రాహ్మణేతరులేగాని
సన్న్యాసులేగాని తదితరాశ్రమస్థులేగాని

అందరును తప్పక తప్తచక్రాంకనపరులు కావచ్చును అటుల కావలశినదియే అదియే సుఖ- శాంతి- ఆనందములకు కారణమగుచున్నది.

శ్లో॥ లక్ష్మత్వా దాత్మభర్తుః ప్రకృతి-పరిణతి-గ్రన్థి-దాహాత్మకత్వాత్ ।
కర్మాంగత్వా ద్ధితత్వా త్తను-తనుశయినో స్సంస్కృతిత్వా త్ప్రియత్వాత్ ।
హేతుత్వా త్సద్గృహీతే రనితర విషయా ద్ద్రావిణా త్కింకరాదేః ।
ధార్యం చక్రాదిచిహ్నం కృతిభి రకృతిభి శ్శ్రేయసే ముక్తయే చ. ॥

అని పెద్దలచే తప్తచక్రాంకణమునకు అమూల్యప్రయోజనములు తెలుపబడుచున్నవి,

తప్తచక్రాంకణ వ్యతిరేక వచనములు కొన్ని గలవు అవి అట్లుండుటకు కారణమేమన తమోగుణాభిభూతులైన అసురులను మోహింపజేయుటకై శ్రీమన్నారాయణునిచే ఆజ్ఞాపింపబడిన రుద్రుడు కొందరు ఋషుల యందావిష్టుడై తద్వారా తమోగుణాభిభూతములగు మోహశాస్త్రములను ప్రవర్తింపజేసెను-మరియు గౌతమమహర్షి శాపాగ్నిదగ్ధులైన కొందరుఋషులు కొన్ని మోహశాస్త్రముల ప్రవర్తింపజేసిరి. అట్టివానియందు మాత్రమే చక్రాంకన విరుద్ధవాక్యములున్నవి గాన అవి శిష్టసమ్మతములు కావు. సాత్త్వికపరిగ్రాహ్యములు కావు సాత్త్వికములు- శిష్టజనానుసరణీయములు నగు సర్వ ధర్మశాస్త్రములకు విరుద్ధములున్ను అయియున్నవి

రుద్రుడు మోహశాస్త్రప్రవర్తకుడైనటుల ప్రమాణ మేమన :—

శ్లో॥ త్వం చ రుద్ర మహాబాహో మోహశాస్త్రాణి కారయ॥ ఇత్యాదులు.

## ఋషులు గౌతమ శాపాగ్ని దగ్ధులగుటలో ప్రమాణ మేమన :—

ఆదిత్యే పురాణే

(1) శ్లో॥ తత శ్శాపహతాః సర్వే
ఋషీః పరమకోపనః
గౌతమ స్తపతాం శ్రేష్ఠ
సామగానాం వరస్తథా ॥

ఆదిత్య పురాణమునందు.

(1) అటుపిమ్మట తాపసోత్తముడైనట్టియు, సామగాన ముడైనట్టియు గౌతమమహర్షి శాపహతులైన ఋషులను గూర్చి అత్యంతకోపముతో యిటుల పలికెను

(2) నిర్దోషాయ యథా మహ్యాం
మాయాం గోరూపధారిణీమ్
కృతవన్త స్తథా సర్వే
త్రయీం త్యక్ష్యథ పాపినః॥

(2) "నిర్దోషి యగు నన్ను మీరు గోరూపమును ధరించినమాయను గల్పించి మోసగించిరి, గాన మీ రందరును వేద విహీనులగుదురుగాక. పాపు లగుదురుగాక.

(3) త్రిపుణ్డ్రధారిణో భూత్వా
భస్మోద్ధూళన తత్పరాః
జటాభార పరిక్రాన్తాః
మిథ్యాజ్ఞానప్రలాపినః॥

(3) త్రిపుండ్రధారులై, భస్మోద్ధూళితగాత్రులై, జటలను ధరించిన వారై మిథ్యాజ్ఞానమున అసత్యములను పలుకు వారలగుదురు గాక.

(4) భవిష్యథ కలౌ సర్వే
మిథ్యాలిఙ్గోప జీవినః,
యేచాన్యే శాపనిర్దగ్ధా
గౌతమస్య మహాత్మనః॥

(4) కలియుగమున మిథ్యాచిహ్నముల ధరించి జీవించువారలైయుందురుగాక, అని గౌతముడు శపించెను.

(5) సర్వే తే ప్రచరిష్యన్తి
బ్రాహ్మణాద్యా సుజాతిషు।
నిన్దన్తి చ హృషీకేశం
బ్రాహ్మణాః బ్రహ్మఘాతినః॥

(5) మహాత్ముడైన గౌతమునిచే నిటుల శపింపబడిన వారందరును మంచి బ్రాహ్మణాది జాతులయందు జనింతురేగాని హృషీకేశుని నిందింతురు. బ్రహ్మఘాతకులై

(6) వేదబాహ్యవ్రతాచారాః
దురాత్మానో దురాగమాః
మోహయన్తి జనాన్ సర్వాన్
దర్శయిత్వా ఫలాని తు.॥

(6) వేద బాహ్యమైన వ్రతాచారముల నాచరించుచుందురు. దుర్మార్గులై, అసన్మార్గ ప్రవర్తనులై, అనేక కామ్యఫలము లను జూపించి జనుల నందరును మోహింప జేయుచుందురు.

మరియు పౌండ్రకవాసుదేవాదులవలె భగవద్వ్యతిరిక్తముగగాని మోసగించు నుద్దేశముచే గాని, విధివిహీనముగగాని, యినుము-మట్టి మున్నగు నిషిద్ధద్రవ్యములతో చేయబడిన శంఖ-చంక్రాంకనములచేగాని, క్రమరహితముగగాని, కేవల ప్రాకృతఫలేచ్ఛచేగాని, కేవల లౌకిగ్నియందుగాని, విధ్యుక్త మంత్ర తంత్రములు లేకుండగాని తప్త చక్రాంకనములు గాకూడదనియు అర్థాత్ భక్తితో, విధ్యుక్తరీతిగ, ఆచార్య-శిష్యక్రమానుసారముగ మాత్రమే తప్తచక్రాంకనములు కావలెననియు ఈ నిషేధవచనములు తెలుపుచున్నవి అంతియే గాని తప్తచక్రాంకనమునకు నిషేధ మెచ్చటను లేదు.

ఇతి శ్రీః

శ్రీ వాసుదాసాశ్రమము,
నడిగడ్డపాలెము
గుంటూరు జిల్లా.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

శ్రీః

శ్రీమతే రామానుజాయనమః.



# తప్తచక్రాంకన విషయమున ప్రమాణములు.

| శ్రుతులు | తాత్పర్యము |
|---|---|

**1. శుక్లయజుషి శతపథబ్రాహ్మణే॥**

శ్రు॥ తప్తం, చక్రం, ద్విభుజే, ధార్య,
మిత్యూర్ధ్వపుండ్ర, మాలభేత్, తస్మాత్,
ద్విరేఖం భవతి॥

**1. శుక్లయజుశ్శతపథబ్రాహ్మణమున.**

తమ గుహ్యసూక్తమున జెప్పబడిన విధితో, తపింపజేయబడిన, చక్రమును, రెండు భుజములయందును ధరింపవలెను. రెండు రేఖలుగా నూర్ధ్వపుండ్రమును ధరింపవలెను.

**2. వేదత్రయే॥**

శ్రు॥ పవిత్రం, తే, వితతం. బ్రహ్మణస్పతే,।
ప్రభు, ర్గాత్రాణి, పర్యేషివిశ్వతః,।
అతప్తతను, ర్నతదామో, అశ్నుతే।
శ్రుతాస, ఇద్వహన్త స్తత్సమాశత॥

**2. మూడు వేదములలో.**

చతుర్ముఖ బ్రహ్మకధికారమును కల్పించిన స్వామియైన భగవంతుడా! నీ సుదర్శన మన్నిటియందును, వ్యాపించినది, ప్రభువగు నీవు, అన్నిటియందును వ్యాపించెదవు కావున నీ సుదర్శనముచే తపింపజేయబడిన దేహముకలవాని పాపములు, పక్వములు గావు, కావున బ్రహ్మను బొందడు. ఆ చక్రమును ధరించువారలే, పరిపక్వమైన పాపములు కలవారై, ఆ బ్రహ్మను బొందుదురు.

**3. తైత్తిరీయే, యజుషికాఠకే**

శ్రు॥ చరణం, పవిత్రం. వితతం పురాణం,
యేన, పూత, స్తరతి, దుష్కృతాని।

**3. తైత్తిరీయ యజుర్వేదమందు, కాఠకమున—**

పురాతనమును శుద్ధిచేయునది పరగతి సాధనమైన, చక్రము సర్వవ్యాపకమైనది,

నేన, పవిత్రేణ శుద్ధేనపూతాః, అతి పాప్మాన, మరాతిం, తరేమ॥
లోకస్య. ద్వార, మర్చిమత్పవిత్రం, జ్యోతిష్మద్భ్రాజమానం, మహస్వత్।
అమృతస్యధారా, బహుధా, దోహమానం, చరణం, నో, లోకే, సుధితాన్దధాతు,॥

ఏ సుదర్శనముచేపరిశుద్ధులగువాడు,అనేక పాపములనుదాటుచున్నారో, పరిశుద్ధమగు నా సుదర్శనముచే మేము పరిశుద్ధులమై, శత్రువగు పాపమును, దాటెదముగాక. లోకులకు భగవల్లాభ ప్రాప్తి హేతువును జ్వాలలు, కిరణములు ప్రకాశముగలవియు, మోక్షానుభవము నిచ్చునదియు నగు చక్రము మా కిహపరలోకసుఖముల నొసంగు గాక.

## 4. ఋగ్వేదే

శ్రు॥ చమూషచ్ఛ్యేన, శ్శకునో, విభృత్వా గోవిందుర్ద్రప్స, ఆయుధాని, బిభ్రత, అపామూర్మిం, సచమాన, సముద్రం తురీయం, ధామ, మహిషోవివక్తి॥

## 4. ఋగ్వేదమున

పంచభూతమయమగు శరీరమును బొందిన భగవదంశమగు జీవుడు, భగవంతుని చక్రాద్యాయుధ చిహ్నములను, ధరించినవాడై ప్రశంసనీయుడగు భగవత్సాన్నిధ్యమును జెందును.తనను సంసారమునుండితరింపజేసుకొన సమర్థుడగును. తనసంబంధులను సైతము,తరింప జేయ సమర్థుడగును అట్టివాడు శ్రేష్టమగు పరమపదమును మహనీయుడై చేరుచున్నాడు

## 5. సామ్ని మైత్రాయణీయ శాఖాయామ్.

శ్రు॥ పవిత్ర, మిత్యగ్నిః అగ్నిర్వై,సహస్రారః సహస్రారో, నేమిః నేమినా, తప్తతనూః బ్రహ్మణ, స్సాయుజ్యగ్ం, సలోకతా మాప్నోతి॥

## 5. సామవేద మైత్రాయణీయశాఖలో

పవిత్రమగు సహస్రారచక్రాగ్నిచే, తపింపబడిన శరీరముగలవాడు పరబ్రహ్మయొక్క సాయుజ్యమును సాలోక్యమును పొందును

## 6. యజుషిబృహదారణ్యకే

శ్రు॥ నిచిక్షేప. సుషణం, భిద్యమానం, మధ్యే, బాహూ, మపద త్సుదర్శనమ్

## 6. యజుర్వేద బృహదారణ్యమున

సమస్తపాపములను భేదించు, సుదర్శనమును విష్ణువు తనచేతిలో, ధరించియున్నాడు, పరమపదము నిచ్చునదియు, గొప్పతేజము గలదియు

విష్ణో, రిదం, భూరిసం, భూరితేజః, ప్రధర్షణం। దివా, నక్తం, బిభృయు, స్తజ్జనాసః॥

నగు నా చక్రమును విష్ణుభక్తులగువారు సర్వకాలములయందును ధరింతురు.

7. అథర్వణే

శ్రు॥ ఏభి, ర్వయ, మురుక్రమస్య, చిహ్నై।
రంకితాః లోకే, సుభగా, భవేమ,
తద్విష్ణోః పరమం, పదం,
గచ్ఛంతి, హి, లాంఛితాః-

7. అథర్వణవేదమున

శ్రీ మహావిష్ణుచిహ్నములగు నీ చక్రాదులచే మేము, అంకితులమై పాపములను పోగొట్టుకొని సౌఖ్యవంతుల మగుదుము గాక, చక్రలాంఛితులు శ్రీ మహావిష్ణుస్థానమగు పరమపదమును పొందుదురు గదా॥

8. ఋచిభాష్కలసంహితాయాం

శ్రు॥ పరితే, విష్ణో, అబ్జచక్రే, పవిత్రే।
జన్మాంబోధిం, తర్తవే, చర్షణీంద్రాః
మూలే, బాహ్వో, ర్దధతే, న్యే
పుణ్యాఅంగా,న్యంగే,తావకా, న్యర్చయన్తి

8. ఋగ్వేద భాష్కలసంహితలో

ఓ మహావిష్ణూ! పవిత్రములగు నీ శంఖచక్రములను, సంసారసాగరమును దాటగోరువారు, బాహుమూలములయందు ధరించుచున్నారు. కొందరు ప్రాచీనులు, నీ చిహ్నములను మరికొన్నిటిని కూడ తమ శరీరమున ధరించుచున్నారు.

9. అథర్వణే మహోపనిషది

శ్రు॥ దక్షిణే, తు, భుజే, విప్రో, బిభృయా,
ద్వై, సుదర్శనమ్, సవ్యే, తు, శంఖం,
బిభృయా, దితి, బ్రహ్మవిదో, విదుః॥

9. అథర్వణమున మహోపనిషత్తులో

విప్రుడు కుడిభుజమున, చక్రమును, ఎడమభుజమున, శంఖమును, ధరింపవలెనని బ్రహ్మవేత్తలు తెలుసుకొనుచున్నారు

10. యజుషి కఠశాఖాయామ్

శ్రు॥ ధృతోర్ధ్వపుండ్రః, కృత చక్రధారీ.
విష్ణుం, పరం, ధ్యాయతి,యో మహాత్మా
సర్వేణ, మంత్రేణ, సదా, హృదిస్థమ్
పరాత్పరమ్, యన్మహతో, మహన్తమ్॥

10. యజుర్వేద కఠశాఖలో

ఊర్ధ్వపుండ్రములను, శంఖ చక్రములను ధరించి, ఓంకారముచే హృదయములో నుండు పరమాత్మయు, పరాత్పరుడును, మహత్తుకంటె మహత్తగు, శ్రీమహావిష్ణువును, ఎల్లప్పుడును ధ్యానించువాడు మహాత్ముడగుచున్నాడు

## 11. యజుషి, ద్వితీయాష్టకే

శ్రు॥ యేన, దేవాః పవిత్రేణ, ఆత్మానం,
పునతే, సదా, తేన, సహస్రధారేణ
పావమాన్యః, పునంతు, మాం॥

## 11. యజుర్వేదమున, రెండవ, అష్టకములో

పవిత్రమగు నే చక్రముచే దేవతలు తమను సర్వదా పవిత్రులుగా జేసుకొనుచున్నారో, ఆ సహస్రారముతో నన్ను పవిత్రుని జేయుదురు గాక

## 12. ఋగ్వేదే

శ్రు॥ చక్రం, బిభర్తి, వపుషాఽభి తప్తమ్
బలం, దేవానా, మమితోస్య, విష్ణోః
స, ఏతి, నాకం, దురితా, విధూయ,
ప్రయాంతి యద్యతయో వీతరాగాః॥

## 12. ఋగ్వేదమున

దేవతలకు బలమగు విష్ణువుయొక్క తపింపబడిన చక్రమును, శరీరమున ధరించువాడు, పాపములను పారద్రోలి, వీతరాగులగువారు పొందు పరమపదమును, పొందును

## ఆ ఋగ్వేదమునందే

శ్రు॥ చక్ర, మాదా, యాగ్నౌ, ప్రతప్య,
బ్రాహ్మణస్య, దక్షిణే, బాహౌ, ధారయేత్
పాంచజన్య, మాదా, యాగ్నౌ, పతప్య
బ్రాహ్మణ, స్యోత్తరే, బాహౌ, ధారయేత్॥

చక్రము నగ్నిలో తపింపజేసి, బ్రాహ్మణుని కుడిభుజమున, ధరింపజేయవలెను. శంఖమును, అగ్నిలో తపింపజేసి, బ్రాహ్మణుని యెడమ భుజమున ధరింపజేయవలెను.

## సామవేదీయ అవ్యక్తోపనిషత్.

ఇంద్రో హ్యై కిల దేవానాం
అనుజావర ఆసీత్

తం ప్రజాపతి రబ్రవీత్.
గచ్ఛ దేవానా మధిపతి ర్భవేతి,

సోఽగచ్ఛ త్తం దేవా ఊచుః,
అను జావరోఽసి త్వం

## సామవేదమునందలి అవ్యక్తోపనిషత్తు

ఇంద్రుడు దేవతలందరకు ననుంగు తమ్ముడై యవతరించెను

బ్రహ్మదేవు డాతనిని దేవతలకు ప్రభువు వగుమని యాదేశించెను.

ఆతడా యాజ్ఞను శిరసా వహించి దేవతల కడకేగ వారాతనిని 'నీవు నీచస్థితిని పొందిన

వాడవగుటచే నీకు మాపై యధికార మెట్లు పొసగునని ప్రశ్నించిరి.

అస్మాకం కుతస్త్వాధిపత్య మితి,
స ప్రజాపతి మభ్యే ద్యోవాచ.

అది విని యింద్రుడా యాక్షేపణను బ్రహ్మ కెఱింగించెను

ఏవం దేవా ఊచు రనుజా
వరస్య కుతస్త్వాధిపత్య మితి,
తం ప్రజాపతి రింద్రం
త్రికలశై రమృతపూర్ణై రనుష్టు
భాభిమంత్రితై రభిషిచ్య,
తం సుదర్శనేన దక్షిణతో
రరక్ష, పాంచజన్యేన వామతో
ద్వాభ్యామేవ సురక్షితో భవత్,
రౌక్మే ఫలకే సూర్యవర్చసి
మంత్ర మనుష్టుభం విన్యస్య
తదస్య కంఠే ప్రత్యముంచత్,

అంత నా బ్రహ్మ అనుష్టుప్ మంత్రముచే నభిమంత్రింపబడిన అమృత భరితములగు మూడు కలశల తీర్థోదకములతో నా యింద్రుని నభిషేకించి కుడిభుజమునకు చక్రముతోను, ఎడమ భుజమునకు శంఖముతోను రక్ష పెట్టి సురక్షితుని గావించి సూర్యకాంతివలె వెలుంగుచున్న బంగరు ఫలకమున అష్టాక్షరీ మంత్రమును విరాజిల్లజేసి కంఠమున కట్టి నిలిపెను.

తత స్సుదుర్నిరీక్ష్యో భవత్
తస్మై త్రివిద్యా మానుష్టుభీం
ప్రాదాత్, తతోదేవాస్తమా
ధిపత్యాయానుమేనిరే,
స స్వారాడభూత్, య ఏవం వేద.

ఆ యింద్రుడా సంస్కారముచే నసురులకు పరిమిల్లు గొల్పుచు చూడ శక్యముగాక యుండెను

అట్లాతడు సంస్కరింపబడి అష్టాక్షరీ మంత్రమును బడయుటచే దేవతలాతని యాధిపత్యము నంగీకరించిరి అంత నా యింద్రుడు దేవతలకు చక్రవర్తి యయ్యెను. ఈ వృత్తాంతము నెఱింగినవాడును ఇట్టి సన్మానముచే బడయగలుడు

శుక్లయజుశ్శతపథబ్రాహ్మణే.

శుక్లయజుశ్శతపథబ్రాహ్మణే.

ప్రశ్న॥ అథ కాత్యాయనః పప్రచ్ఛ
యాజ్ఞవల్క్య ఇతి హోవాచ।

1 పిమ్మట కాత్యాయన యాజ్ఞవల్క్య సంభాషణలో నిట్లు చెప్పెను. అంతటను నేత్ర

పరం బ్రహ్మైకో దేవో విశ్వ
స్పృక్ రత విశ్వాక్షో విశ్వతో
బాహు రుత విశ్వతః పురుషోఽన్త
ర్యామోఽన స్సామ న్ప విశ్వతోముఖ
స్సర్వాత్మా విశ్వాత్ స్యాదిరి। నారాయ
ణా ద్బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో
జాయత ఇతి, సంబాహుభ్యాం సమభి
సంపతత్రైర్ద్యావా భూమీజనయ
న్దేవ ఏకః। పురుషోఽన్తర్యామోఽన్త
ర్యామః। స ఆదిత్యతేజోభవతి.
స ఆదిత్య లోకో భవతి। స విష్ణు
రేవ భవతి। స విష్ణులోకో భవతి,
తప్తం చక్రం ద్విభుజే ధార్యమిత్యగ్ని
హోత్రి మేవ లోకోభవతి, ఊర్ధ్వ
పుణ్డ్రి మారిఖేత్తస్మా ద్విరేఖం భవతి।
భూ స్స్వయంభూః బ్రహ్మణస్సాయుజ్యం
స లోకతాం జయతి య ఏవం వేద.

ములు కలవాడును, అన్నిటికిని ఆత్మయైన
వాడును, అంతటను చేతులు కలవాడును. పరం
బ్రహ్మయనబడు ఒక దైవము కలదు ఈ పరమ
పురుషు డంతర్యామిగనే యుండి అంతటను
ముఖములును, పాదములును కలిగి అన్నిటికిని
ఆత్మయై యున్నాడు ఈతడే నారాయణుడు
ఈతని నుండి చతుర్ముఖుడు పుట్టుచున్నాడు.
రుద్రుడును పుట్టుచున్నాడు.

ఆ నారాయణుడే సృష్టికాలమున సకల
లోకస్థులను సృష్టించుచు అధః పతితులైన
జీవులు తన నారాధించి తరించుటకు గాను
వారిని హస్తపాదాద్యవయవములతో కూర్చు
చున్నాడు. వారు వాటి నుపయోగపరచి ఆయా
పనులు చేయుటకుగాను, తాను జీవాంతర్యామి
గానుండును. ఆతడు సూర్యలోకమున సూర్యు
నకంతర్యామిగా నుండి యాతనిని వెలిగించు
చున్నాడు. వైకుంఠమునందుండియు నంతటను
వ్యాపించుచున్నాడు. ఇట్టి మహోపకారియగు
శ్రియఃపతికి మనము దాసులమగు రక్ష్యవర్గమని
సూచించుటకుగాను మన మాతని చక్రమును
తాపింపజేసి రెండుభుజములయందును ధరించవలెను
రెండు రేఖలుగా ఛిద్రోర్ధ్వపుండ్రమును ధరించ
వలెను. అప్పుడీ చేతనుడు పత్తనుబడని పరమ
పురుషుని సాయుజ్యమును బడసి శ్రీ వైకుంఠ
మున సర్వోత్కర్షతో విరాజిల్లును ఈ రహ
స్యము నెఱింగి క్రమముగా నీ ఫలములు బడయ
గలుగును

2. జ్ఞానం వై పురుషో బ్రాహ్మణో
జాయతే వైష్ణవ్రాహ్మణో భవతి.

2. సత్వగుణ ప్రాధాన్యముచే జ్ఞానసంప
న్నుడై బ్రాహ్మణుడై జన్మించును

ద్విభుజే ధార్యమితి, బ్రహ్మణ స్సాయుజ్యం సలోకతాం జయతి య ఏవంవేద,

ప్రియుడగు నా నారాయణునియొక్క తప్త చక్రము నెవడు తన రెండు భుజములయందును ధరించి ఉపాసించుచున్నాడో వాడు విష్ణు తుల్యుడై పరమ పదమున పరమపురుషుని సాయుజ్యమును బడయ గల్గును ఇట్లెఱింగి నను క్రమముగా నా ఫలమును బడయ గల్గును.

5 ఇదం వై తత్పురుషస్య పరాయణో భవతి, తప్తం చక్రం ద్విభుజే ధార్యమితి, ఇమా వేవ గౌతమ భరద్వాజే ఇమావేవ విశ్వా మిత్ర జమదగ్నీ.
ఇమావేవ వసిష్ఠ కాశ్యపౌ వామదేవోఽత్రిః స విష్ణురేవ భవతి య ఏవం వేద.

5. తపింప జేయబడిన చక్రమును రెండు భుజములయందును ధరించుటయే మానవునకు ముఖ్యమగు మోక్షసాధనము. ఇందులకు సాక్ష్యమీ గౌతమ భరద్వాజులే. ఈ విశ్వామిత్రి జమదగ్నులే. ఈ వశిష్ఠకాశ్యపులే. అత్రివామదేవులే

ఇట్లెరింగినవాడు క్రమముగ అనుష్ఠించి శ్రీ విష్ణుసాయుజ్యమును బడయును

6. దేవాసః పితరో యేన విధృతేన బాహునా సుదర్శనేన ప్రయాతా స్స్వర్గం లోక మాయన్।
యే నాఙ్కితా మనవో లోకసృష్టిం వితన్వన్తి బ్రాహ్మణా స్తద్వహన్త్యగ్ని నావై హోత్రా తప్తం చక్రం ద్విభుజే ధార్య మిహ్యూర్ధ్వపుణ్డ్రమాలిఖేత్త స్మాద్విరేఖం భవతి పునరాగమనం నయాతి బ్రహ్మణ సాయుజ్యం సలోకతాం జయతి య ఏవం వేద.

6. తండ్రులవలె లోకహితైషులగు దేవతలు ఏ చక్రలాంఛిత భుజులై మరణించినపిదప పరమపదము నధిరోహించిరో, యే చక్రలాంఛిత భుజులై మనువులు లోకములు సృజించిరో అట్టి అగ్నిచే తప్తమగు చక్రలాంఛితులగు విప్రులు సచ్ఛిద్రోర్ధ్వపుండ్రధారులై పరమపదము నధిరోహించిరి కావున నట్టి తప్తచక్రాంకితులు పునరావృత్తిరహితమగుపరమపదమునలంకరించి శ్రీయఃపతి సామ్యమును బడయుదురు. ఇట్లెఱింగిన వారును క్రమముగ ననుష్ఠించి సర్వోత్కృష్టులై విలసిల్లుదురు

7. అథ కాత్యాయనే తి హోవాచ.
విష్ణురిన్ద్రోవై దేవా ఇన్ద్రోవై నారాయణా

7. అగ్నిచే తపింపజేయబడిన చక్రమును తమ భుజములపై ధరించిన బ్రహ్మవేత్తలు

న్ను జాయతే, కిందైవతోస్యాం విష్ణు దైవత ఇతి। స విష్ణుః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి. రూపాణి పశ్యతి. కస్మిన్ రూపాణి. ప్రతిష్ఠతానీతి. హృదయ ఇతి హోవాచ.
తప్తం చక్రం ద్విభుజే ధార్యమితి,
బ్రహ్మణ స్సాయుజ్యం సలోకతాం జయతి య ఏవం వేద,
తప్తం చక్రం ద్విభుజేధార్య మితి బ్రాహ్మణా స్తద్వహన్త్యగ్నినావై హోత్రా తప్తం తను రిత్యా పోఽన్తరిక్షం సముద్రం గచ్ఛన్త్య థాపో దేవా స్సముద్రం గచ్ఛన్తి. యథాహవై దేవా బ్రాహ్మణాః కేశవం ప్రతి గచ్ఛన్తి।

నదీజలములు ఆకాశమును సముద్రమున జేరి విశ్రమించు చందమున దివ్య తేజముతో వెలుగొందువారై శ్రీఃపతి సాన్నిధ్యమును బడయు చున్నారు.

౭. అథకాత్యాయనేతి హోవాచ.

సర్వం తదిదం సర్వాత్మనః పరాయణం నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం ఇతి దేవో భూత్వాదేవాసః పితరోవిదు రి త్యాత్మాగుహాయాం నిహితోఽస్య ఇత్యన్త ర్యామో మఘవన్ మాదయ స్వ స్వాహోర్వన్తరిక్ష మన్వేమి స్వాం కృతోఽసీతి బ్రహ్మేతిహోవాచ.
తప్తం చక్రం ద్విభుజేధార్యమితి-బ్రాహ్మణ సాయుజ్యం సలోకతాం జయతి। య ఏవం వేద.

13 సుదర్శనోపనిషది

శ్రు॥ యజ్ఞోపవీతీ, కృతచక్రధారీ, యో,
బ్రహ్మవిదో, ద్విబ్రహ్మవిదో, మనీషా,
స్త్రీశూద్రాసంబాహుభ్యాం ధారయేత్॥

13 సుదర్శనోపనిషత్తులో

యజ్ఞోపవీతధారియైన తప్తచక్రాంకితుడగు బ్రహ్మవేత్త, స్త్రీ, శూద్రులను. భాగుగా చక్రాంకితులనుగా జేయవలయును

14 మహాసుదర్శనోపనిషది

శ్రు॥ తప్తం చక్రం, ద్విభుజే, ధార్యమ్॥

14. మహాసుదర్శనోపనిషత్తులో

తప్తమగు చక్రమును రెండు భుజముల యందును ధరింపవలయును.

ఈ శుక్లయజుశ్శతపథబ్రాహ్మణము, చక్రపరిశేషవిశిష్టమనుటకు పంచమ వేదమగు, మహాభారతము, ప్రమాణము, చూడుడు. శాంతిపర్వమున, యాజ్ఞవల్క్య, కరాళజనక సంవాదమును.

15. శ్లో. శృత్వా శతపథం సాగ్రం
సరహస్యం ససంగ్రహమ్
చక్రేణ పరిశేషం చ,
హర్షేణ పరమేణచ.

15. శతపథ బ్రాహ్మణమును మొదటినుండి యును రహస్యములతోను. సంగ్రహముల తోను, చక్రపరిశేషముతోడను, విని, మహా సంతోషమును బొందెను.

16. రహస్యామ్నాయా బ్రాహ్మణే.

శ్లో. తథా, విష్ణుః, లక్ష్మ్యై, శ్రీమ ద్ద్వయ,
ము పదిదేశ, దేవి చేమాం, బ్రహ్మ
విద్యాం, సాం, గాం, రహస్యాం, విష్వ
క్సేనా, యోపదిశత్,,
విష్వక్సేనోఽమృతతీర్థే. ఐరమ్మదీయె,
తటాకే, సోమవసనాఖ్యా శ్వత్థచ్ఛాయా
యాం వైనతేయోపహృతాం, శ్వేత
మృత్స్నాం, శంఖ, చక్రోర్ధ్వపుండ్రం

16. రహస్యామ్నాయ బ్రాహ్మణమున

శ్రీ మహావిష్ణువు లక్ష్మికి ద్వయ ముపదేశిం చెను. లక్ష్మి యీ బ్రహ్మవిద్యను, అంగము లతోను, రహస్యములతోను, విష్వక్సేనునకు పదేశించెను. విష్వక్సేనుడు అమృతతీర్థ మున, ఐరమ్మదీయ తటాకమున, సోమవ సనమను రావిచెట్టు నీడను, గరుడుడు దెచ్చిన, శ్వేతమృత్తికను శంఖ, చక్ర ఊర్ధ్వపుండ్ర, దాస్యనామ, మంత్రయాగ

దాస్యం, మంత్రోయాగ చ్ఛేతి, పార మైకాన్తికధర్మాన్, బ్రహ్మణం ధార, యత్, బ్రహ్మ, సనత్కుమారం. సన త్కుమారో, నరదం, నారదో, వ్యాసం వ్యాసో, బృహత్సేనం, శుకం చేతి, ఇదముపనిషదం.

ములను, పారమైకాన్తిక ధర్మములను, బ్రహ్మను ధరింపజేసిరి. బ్రహ్మ సనత్కుమారుని, సనత్కుమారుడు. నారదుని, నారదుడు వ్యాసుని, వ్యాసుడు బృహత్సేనుని శుకుని, ధరింపజేసెను. ఇదియుపనిషత్తు.

**17.** కాండవేదే,

శ్రు. దేవాసో. యేన, విధృతేన, బాహూనా, సుదర్శనేన, ప్రయాతం, స్వర్గ, మాయాంతి, తామలోకవిస్సృష్ట వీతస్వయంతి, బ్రహ్మణా, వై, సర్వం, సర్వావై, దేవతానాం. సర్వా వై, విప్రా ణాం, సర్వా వై, క్షత్రియాణాం సర్వా వై, వైశ్యానాం, సర్వావై శూద్రాణా, మిత్య గ్నినా వై, హోత్రా తప్తం, చక్రం, ద్విభుజే, ధార్యే, తోర్ధ్వపుండ్ర, మాలి ఖేత్, తస్మా, ద్విరేఖం, భవతి, పున, రాగమనం, నచేతి, బ్రహ్మణ, స్సాయు జ్యం, సలోకతా, మా ప్నోతి.

**17.** కాండవేదమున

దేవతలందరు సుదర్శనము బాహువులయందు ధరించియే స్వర్గమును పొందిరి. బ్రహ్మ, దేవతలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మొదలగువారం దరు అగ్నితప్తమగు చక్రమును రెండు భుజములపైనను ధరింపవలెను. ఊర్ధ్వ పుండ్రమును ధరింపవలెను. అట్లు చేయుట వలన పునరావృత్తి లేదు. బ్రహ్మ సాయుజ్యమును, సాలోక్యమును, పొందు చున్నారు.

**18.** పరమోపనిషది

శ్రుతి. నేమినా, తప్తతనుః బ్రహ్మణ స్సాయు జ్యం, సలోకతా, మాప్నోతి.

**18.** పరమోపనిషత్తునందు.

తప్తచంక్రాంకనముగలవాడు, బ్రహ్మసాయుజ్య మును పొందుచున్నాడు.

**19.** అథర్వాణే.

శ్రుతి. అగ్నినా వై, హోతారః, చక్రకం, పాంచజన్యం, తు తప్తౌ, ద్విభుజే, ధా

**19.** అథర్వాణవేదమున.

అగ్నిహోత్రమున తప్తమైన, చక్రమును, శంఖ మును, రెండు భుజములయందును, ధరించ

రయేత్, ఆత్మహిత, మాచరేత్, ఆచార్యాయ, స్వముఖం, ప్రపద్యేత్, తద్వైకుంఠో, భవతి, పునరాగతి, ర్న సాయుజ్యం, సాలోక్యతా, మాప్నోతి.

వలసినది, అదియె ఆత్మోజ్జీవనమునకు హేతువు. ఆచార్యుల ద్వారా ప్రపత్తి చేయవలసినది, అట్టివారు వైకుంఠమును పొంద గలడు. వానికి తిరిగి జన్మలేదు. శ్రీమహా విష్ణువుయొక్క సాయుజ్యమును, సాలోక్య మును పొందగలడు,

# తప్తచక్రాంకన విషయమున స్మృతి ప్రమాణములు.

పరాశరస్మృతౌ, ఉత్తరఖండే, ద్వితీయాధ్యాయే

పరాశరస్మృతిలో, ఉత్తర ఖండమున ద్వితీయాధ్యాయమున.

20 శ్లో॥ వినా, యజ్ఞోపవీతేన,।
వినా, చక్రస్య, ధారణాత్।
వినా, ద్వయేన, వై, విప్రః।
ఛండాలత్వ, మవాప్ను, యాత్॥

20. యజ్ఞోపవీతము, చక్రధారణము. ద్వయము, లేనిచో, విప్రుడు ఛండాలత్వమునుబొందును.

21. „ విధినా, శంఖ, చక్రాది।
ధారణం, చోర్ధ్వపుండ్రకమ్।
ఉపవీతం, శిఖాబన్ధో।
విప్రస్య, సతతం, స్మృతమ్॥

21. శంఖ, చక్రములను ధరించుట, ఊర్ధ్వ పుండ్రము, యజ్ఞోపవీతము, జుట్టుముడి, ఇవి, విప్రుడైన వానికి నిత్యమగు విధులు.

22. „ చక్ర లాంఛన హీనస్య।
ద్విజత్వం, నిష్ఫలం, భవేత్॥
అచక్రధారిణం, విప్రం।
య, శ్శ్రాద్ధే భోజయే, న్నరః।
రేతో మూత్ర పురీషాది।
సః, పితృభ్యః, ప్రయచ్ఛతి॥

22. చక్ర లాంఛనము లేని వాని, ద్విజత్వము నిష్ఫల మగుచున్నది.
చక్రాంకనము లేని విప్రునికి, శ్రాద్ధమున భోజనము బెట్టువాడు తన పితరులకు, రేతో, మూత్ర, పురీషములను బెట్టినవాడగును.

**23.** ,, శంఖ, చక్రో ర్ధ్వపుండ్రాది।
రహితో, బ్రాహ్మణాధమః।
జీవన్నేవ, స, ఛండాలః।
సర్వకర్మసు, గర్హితః॥

23. శంఖ, చక్రాంకనము, ఊర్ధ్వపుండ్రము లేని బ్రాహ్మణుఁడు, ఛండాలుఁడు, అత డన్ని కర్మలలోను, నిందితుడగుచున్నాడు.

**24.** ,, చక్ర సంస్కార హీనస్య।
ద్విజత్వం నిష్ఫలం భవేత్

24. చక్రాంకనము లేని వాని ద్విజత్వము నిష్ఫలము.

25. వృద్ధపరాశరస్మృతౌ.

శ్లో॥ అగ్నినైవ, తు, సంతప్తం,
చక్ర, మాదాయ, వై, ద్విజః।
దారయే, త్సర్వ, వర్ణానామ్।
హరిసాలోక్యసిద్ధయే॥

25. వృద్ధ పరాశర స్మృతిలో

సర్వ వర్ణముల వారిని బ్రాహ్మణుఁడు అగ్ని తప్తమగు చక్రమును, ధరింపజేయవలయు దాని వలన విష్ణు సాలోక్యము కల్గును

**26.** ,, ఉపవీతీ శిఖీ, విప్రః।
చక్ర లాంఛన, సంయుతః।
చక్రలాంఛన, హీనస్య।
విప్రస్య, విఫలాః క్రియాః॥

26. విప్రుడు యజ్ఞోపవీతము, శిఖ, చక్రాంకనము, కలగియుండవలెను. చక్రాంకనము. లేనివాని కర్మలు ఫలములేనివి.

27. శంఖస్మృతౌ.

శ్లో. ఉపవీతాది వ ద్ధార్యాః।
శంఖ, చక్ర, గదా దయః।
బ్రాహ్మణస్య, విశేషేణ।
వైష్ణవస్య, విశేషతః

27 శంఖస్మృతిలో

యజ్ఞోపవీతము వలెనే బ్రాహ్మణుడు, శంఖ చక్రగదాదులను ధరించవలెను వైష్ణవునికివి ముఖ్యమైనవి.

28. శాండిల్య స్మృతౌ

శ్లో. పశు పుత్రాదికం సర్వం
గృహో పకరణాని, చ,

28. శాండిల్య స్మృతిలో

పశుపుత్రాదులను, గృహోపకరణములను శంఖ చక్రాంకితులు గా జేయవలెను. విష్ణునామ మును ధరింపజేయవలెను

అంకయే చ్ఛంఖ చక్రాభ్యాం
నామ, కుర్యాచ్చ, వైష్ణవమ్॥

29 ,, నా. ముద్రయే దాసనాని
శయనాని. మహీతలమ్
స్థాపయే క్షేత్ర మధ్యేతు।
శిలాం చక్రాది, ముద్రితామ్॥

29 శయనాసన, భూములను ముద్రింప నవసరములేదు స్థలములో మధ్యన, చక్రాంకితమగు శిలను స్థాపించవలెను

30 నారదస్మృతౌ.

శ్లో॥ సువర్ణ రూప్య, తామ్రాద్యైః
కృత్వా శంఖం, సుదర్శనమ్।
ద్విజాతి, రేకజాతి, శ్చ,
బిభృయా, దగ్ని, సంయుతమ్.

30. నారదస్మృతిలో

బంగారము, వెండి, రాగి, మొదలగువానితో శంఖ, చక్రములను జేయించి, అగ్నితప్తములగు వానినిద్విజాతులుగాని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరు ధరింపవలెను.

31. హారీతస్మృతౌ

శ్లో. ప్రతప్తం శంఖ, చక్రాది,
హేతి భి ర్మంత్ర ముచ్చరన్
దక్షిణే, తు, భుజే, చక్రం,
వామాంశే, శంఖ, మేవ, చ.

31. హారీత స్మృతిలో

శంఖ చక్రములను తపింపజేసి, మంత్రమును జెప్పుచు, కుడిభుజమున చక్రమును, ఎడమ భుజమున శంఖమును ధరింపజేయవలెను.

32. ,, గదాం, చ, ఫాలమధ్యే, తు,
హృదయే, నందకం, తథా,
మస్తకే, తు, తథా, శార్ఙ్గమ్,
అంకయే, ద్విమలం, తథా.

32. ముఖమధ్యమున గదను, హృదయమున నందకమును తలపైన శార్ఙ్గమును, స్పష్టముగా ముద్రింపవలెను.

33. ,, హోమశేషం, సమా, ప్యాథ,
వైష్ణవాన్, భోజయే, త్తతః,
ఏవం, తాపక్రియా, కార్యా,

33. హోమమును పూర్తిజేసి, వైష్ణవులకు, భోజనము బెట్టవలెను ఇట్లు పాపముల నడచు విష్ణుచిహ్నములచే తాపము జేయ

వైష్ణవః, కలుషాప హైః
తాపసంస్కారమాత్రేణ,
పరాం, సిద్ధి, మవాప్నుయాత్.

వలెను, తాపసంస్కారమాత్రమునవే పరమ పదమును బొందును.

34 కేచిత్తు, శంఖచక్రౌ, ద్వౌ,
ప్రశస్తౌ బాహుమూలయోః,
ధారయన్తి, మహాత్మానః,
చక్ర, మేకం, తు, చాపరే.

34 మహాత్ములు కొందరు, శంఖచక్రములను రెంటిని, రెండుభుజములయందు, ధరించుచున్నారు మరికొందరొక్క చక్రమును మాత్రమే ధరించుచున్నారు.

35. ,, తే నైవ, బాహుమూలే, తు,
ప్రతప్తే, నాంకయే, ద్బుధః,
జాతే, పుత్రే, పితా, స్నాత్వా,
హోమం, కృత్వా, విధానతః

35. పుత్రుడు కలిగినపుడు తండ్రి స్నానము జేసి,తప్తచక్రముచే కుమారుని భుజములపై అంకనముజేయవలెను.

36. తేనా, గ్నినైవ, సంతప్త,
చక్రేణా, భుజమూలయోః,
అంకయిత్వా, శిశుం, పశ్చాత్,
నామ కుర్యా, చ్చ, వైష్ణవమ్॥

36. అగ్ని తప్తమగు చక్రముచే, భుజముల యందంకనము జేసి పిల్లవానికి, విష్ణువు యొక్క పేరును బెట్టవలెను.

37. ,, అనంకయిత్వా, చక్రేణ,
యత్కించి, త్కర్మ, సంచరేత్,
తత్సర్వం, యాతి, విఫలమ్,
ఇష్టాపూర్తాదికం, నృప॥

37. చక్రాంకనము జేయక, ఇష్టాపూర్తాది కర్మలను(యజ్ఞయాగాదులు,దానధర్మములు ఆలయ తటాకాది నిర్మాణములు) జేసినను అవి వ్యర్థములే యగును.

38. ధారయే, న్మంత్ర దీక్షాయామ్,
చక్రాద్యాః పంచహేతయః,
చక్రం వై, కర్మసిద్ధ్యర్థమ్,
జాతకర్మణి, ధారయేత॥

38. మంత్రదీక్షలో, చక్రము, మొదలగు పంచాయుధములను ధరింపవలెను జాత కర్మలో కర్మసిద్ధికి, చక్రాంకనము జేయ వలెను.

39. అచక్రధారీ, విప్రస్తు,
సర్వకర్మసు, గర్హితః

39. చక్రాంకనము లేని విప్రుడు ఏ కర్మకును పనికిరాడు, విష్ణుసంబంధము లేనివారై

అవైష్ణవత్వం, మాప్నోతి,
నరకం, చైవ సగచ్ఛతి॥

నరకమును బొందుచున్నాడు.

40. చక్రాది, చిహ్న రహితం,
ప్రాకృతం, కలుషాన్వితమ్,
అవైష్ణవం, తు, తం, దూరాత్,
శ్వపాక, మివ,సంత్యజేత్

40. చక్రాంకనము లేనివాఁడు, ప్రాకృతుఁడు, పాపి. అవైష్ణవుఁడు, వానిని ఛండాలునివలె తలంచి తొలగిపోవలెను.

41. తస్మా, చ్చక్రం. విధానేన,
తప్తం, వై ధారయే, ద్విజః,
సర్వాశ్రమేషు. వసతామ్,
స్త్రీణాం, చ, శృతి చోదనాత్॥

41. అందువలన బ్రాహ్మణుఁడు విధి ప్రకారముగా తప్తమగు చక్రమును, అన్ని ఆశ్రమములలో నున్నవారికిని స్త్రీలకును, వేద విహితమైనదిగాన, ధరింపజేయవలెను.

42. అనాయుధావా, అసురా,
అదేవా, ఇతి, వై, శ్రుతిః
పవిత్రం, వితతం బ్రహ్మ,
ప్రభో, ర్గాత్రేషు, లాంఛితమ్॥
శృతయే, వాంకయే, ద్గాత్రే
తద్బ్రహ్మ, సమవాప్తయే॥

42 చక్రాద్యాయుధములనుధరింపనివారు, అసురులు, దేవతలు కానివారని శ్రుతిచెప్పుచున్నది.

ప్రభువగు విష్ణు, చక్రమును, బ్రహ్మప్రాప్తి గోరువాఁడు తన శరీరముపై ధరింపవలెను.

43. దక్షిణే, తు, భుజే, విప్రో,
బిభృయా, ద్వై, సుదర్శనమ్,
సవ్యే, తు, శంఖం, బిభృయాత్,
ఇతి, బ్రహ్మవిదో, విదుః॥

43. విప్రుఁడు కుడిభుజమున, చక్రమును, ఎడమభుజమున, శంఖమును, ధరించవలెనని బ్రహ్మవేత్తలు జెప్పుచున్నారు.

44. శంఖం, చక్రోర్ధ్వపుండ్రాది,
చిహ్నైః, ప్రియతమైః, ర్హరేః,
రహిత, స్సర్వధర్మేభ్యః,
ప్రచ్యుతో, నైన, మాప్నుయాత్॥

44 శంఖ చక్రోర్ధ్వ పుండ్రాదులగు చిహ్నములు, విష్ణువునకు మిక్కిలి ప్రీతికరములు అవి లేనివాఁడు, సర్వధర్మముల నుండి, భ్రష్టుడై పరమాత్మను బొందజాలడు

45. శ్రీ పాంచరాత్రే, పారమేశ్వర సంహితాయామ్.

శ్లో॥ ఏవం, తదీయవిప్రా, శ్చ,
క్షత్రియా, వైశ్యజాతయః
మౌద్గల్యాద్యా, స్తథా, చాన్యే,
న తచ్చిహ్నా, వివర్జితాః.

45. పాంచరాత్రమున, పారమేశ్వర సంహితయందు.

ఇట్లు వైష్ణవులగు, విప్రులు, రాజులు, వైశ్యులు, శూద్రులు, మొదలగు వారందరు, చక్రాంకనము లేనివారుగారు.

46. ,, భవేయు, స్సర్వదా, తస్మాత్,
శంఖ, చక్ర, గదాంబుజైః,
లోహైః, రనలసన్తప్తైః,
త త్తన్మంత్రాధి వాసితైః.

46. అందుచే నా యా మంత్రములచే తపింప జేయబడిన, లోహ శంఖ, చక్ర, గదా, పద్మములను.

47. ,, పూజితై, రర్ఘ్య, గంధాద్యైః
అంకితవ్యాః, క్షణేన, తు,
త్రయ్యంత, జ్ఞాన సంపన్నాః,
యథోక్తా చార నిష్ఠితాః.

47. అర్ఘ్య గంధాదులచే పూజించి వేదాంత జ్ఞానము కలవారును, ఆచార నిష్ఠులగు వారును, చక్రాంకనము జేయవలెను.

48. ,, విప్రాద్యా, స్తే, చ శూద్రాశ్చ,
యద్యేవం, కృతలక్షణాః,
తదా, తు, యోగ్యా, విజ్ఞేయాః,
సమయ శ్రవణాదిషు.

48. బ్రాహ్మణులు, శూద్రులు మొదలగు వారందరు, చక్రాంకితులైనపుడే, రహస్యములను, వినుట కధికారులు.

49. ,, శాస్త్రోదితాసు సర్వాసు
సామగ్రీషు, మహామతే.
యాగో పకరణా, న్యేవ,
మర్ఘ్య పాద్యాది కాన్యపి.

49. శాస్త్రోక్తములగు సామగ్రులయందును, అధికారులు, ఇట్లే, అర్ఘ్య పాద్యాదులగు, పూజోపకరణములను.

50. ,, సం లాంఛ్యాని, యథా. యోగం
శంఖం, చక్రాదిలక్షణైః

50. భగవంతుని వాహనములను, ఆసనములను, తగినట్లుగా, శంఖచక్రాదులచే నలంకరింపవలెను

తథా యానాసనాదీని,
విభో. స్సర్వాణి, యత్నతః.

51. ,, స్యాతోపకరణం, సర్వం,
ఆ ంనాది వివర్జితం,
అంగులీయక పర్యంతం,
సర్వముష్షేషపూర్వకం.

,, చక్రాది లాంఛితం, కుర్యాత్,
తదీయా, శ్చ. గదాదయః,
విప్రాది వల్లాంఛితవ్యాః,
తదీయా, భూరుహాదయః,

51. తాను కూర్చుండు ఆసనాదులే గాక, మిగిలిన తన సామగ్రులను ఉంగరములు, కిరీటములు మొదలగు నవియును. చక్రాంకనము చేయబడవలెను.

భగవంతుని సంబంధములైన, గోవులకు వృక్షములకు గూడ చక్రాంకనము జేయవలెను.

52. ,, లాంఛితవ్యా, యథాయోగం,
శంఖచక్రాది, లక్షణైః
అరాధనాద్యాః, కర్మణ్యాః,
ఏవం. చక్రాది లాంఛితాః,

52. భగవంతుని యారాధకులు కైంకర్యపరులు మొదలగు వారందరును, శంఖ చక్రాదులచే నలంకరింపబడవలెను.

53. ,, దేవతాంతర చిహ్నై, స్తు,
అకర్మణ్యా, హి, లాంఛితాః.

53. ఇతర దేవతా చిహ్నములచే. లాంఛితులు, భగవత్కర్మలకు, తగినవారు గారు.

54. శ్రీవిష్ణుతత్త్వే,తృతీయపాదే, ప్రథమపటలే.

54. శ్రీ విష్ణుతత్త్వమున మూడవ పాదమున ప్రథమపటలమున.

శ్లో. ఏవం, విజ్ఞాపితా, శ్శిష్యా,
శ్చక్ర లింగ సమన్వితాః,
దేవా. ఏవ, భవ, న్త్యే తే,
నా న్యేషాం, కర్మకారకాః.

ఆచార్యునిచే నాజ్ఞాపించ బడినవారై, చక్రాంకనపరులగు, శిష్యులు, దేవతలే యగుచున్నారు. వారు కేవలము వైష్ణవులే గాని తదితర దేవతా కింకరు లెన్నటికిని గారు.

55. ద్వితీయపటలే.

,, ఇతి, తేనాఽ భ్యనుజ్ఞాత,
శ్చక్ర లింగ ధరో, భవేత్.

55. ద్వితీయపటలమున.

ఇట్లాచార్యునిచే నంగీకరింప బడినవాడై, చక్రాంకనపరుడు కావలెను.

56. నవమపటలే.

శ్లో॥ సంస్కార వ్యంజితాత్మనః,
ప్రతిచ్ఛందేన. లాంఛితాః,
దేవాభిధాన వంత, శ్చ,
త్యక్తాస్పద పరిగ్రహాః,
తమేవ, సర్వభావేన,
సంప్రపయాన్తు, మహామునే,

56. తొమ్మిదవ పటలమున.

చక్రాంకన సంస్కారముచే ప్రకాశించువారై, విష్ణుదేవుని, పేరు గలవారై, సర్వమును, శ్రీమన్నారాయణుడే యని సర్వభావములతో, భగవంతుని పొందుదురు గాక.

57. అన్తిమ పటలే

శ్లో. చక్రాది ధారణం, పుంసాం
పర సంబంధ వేదనమ్,
పతివ్రతా నిమిత్తం, హి
వలయాది విభూషణమ్.

57 చివరిపటలములో.

చక్రాంకనాదులు, పరమాత్మ సంబంధమును దెల్పును, గాజులు, మంగళసూత్రాద్యలంకారములు, పాతివ్రత్యము నకవసరములే.

58. ,, బ్రహ్మచారీ, గృహస్థో,వా
వానప్రస్థో ఽథ, భిక్షుకః,
ఏతే, హ్యాశ్రమిణః, ప్రోక్తా,
శ్చత్వారః క్రమయోగతః.

58. బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థుడు, భిక్షుకుడు(సన్యాసి)అనెడు నాల్గుఆశ్రమములలో నుండునారును.

59. ,, చక్ర లింగ ధరా, స్సర్వే,
సమయ వ్రత నిష్టితాః.

59. చక్రాంకన ధారులై, నియమిత మగు వ్రతముగలవారై యుండవలెను.

60. పరాశర సంహితాయాం.

శ్లో॥ శ్రోత్రియో, విష్ణు భక్త, స్తు,
గృహస, శ్శాస్త్ర విత్తమః,

60 పరాశరసంహితలో.

వైదికాచారము గలవాడును, విష్ణు భక్తుడును, గృహస్థుడును, శాస్త్రము

చక్ర లింగ ధరో, విప్రః,
ప్రతిష్ఠాం, కర్తు, మర్హతి

లెరిగినవాడును, చక్రాంకనమైనవాడు నగు విప్రుడు ప్రతిష్ఠ జేయుటకు తగినవాడు.

61. తేన, ప్రతిష్ఠిత, స్తత్ర
సన్నిధత్తే, సదా, హరిః.

61. అట్టివాడు ప్రతిష్ఠ జేసినచోటనే విష్ణు వెల్లపుడు నుండును.

62 నారదీయ పద్ధతౌ.

,, గృహస్థ శ్రోత్రియో, విప్రో,
నిత్యకర్మ రత. శ్శుచిః
శాన్త శ్చక్రధరో, దాన్తః
సద్భక్తో, దోషవర్జితః

62. నారదీయ పద్ధతిలో

వైదికుడును, నిత్యకర్మరతుడును, శమదమాది గుణాంసపన్నుడును. గృహస్థుడునగు విప్రుడు చక్రచిహ్నమును, ధరించినవాడై, దోషము లేని భక్తుడగుచున్నాడు.

63. సనత్కుమార సంహితాయాం.

శ్లో॥ కృష్ణాయుధాంకితో, భూత్వా,
పితృకార్యం, కరోతి, యః,
తత్సర్వం, ప్రతిగృహ్ణాతి,
గయాయాం, తు, గదాధరః

63. సనత్కుమార సంహితలో.

చక్రాంకితులై, దేవ, పితృ, నిత్య, నైమిత్తిక, కర్మలజేసిన, నా కర్మ, అక్షయఫలము గలవగును.

64. ,, చక్రాంకితభుజో, భుంక్తే,
యస్యాం పజ్త్కౌ ద్విజోత్తమః
పునాతి సకలాం పజ్త్కిం,
గంగే వోత్తరవాహినీ.

64 చక్రాంకితుడగు ద్విజోత్తముడు, పంక్తిలో నున్నచో, ఉత్తరవాహినియగు గంగ వలె నా పంక్తి యంతయు, పావనము జేయ గలదగును.

65. విష్వక్సేన సంహితాయాం.

శ్లో॥ శరీరే, యస్య, కస్యాపి,
దృశ్యతే, వై, సుదర్శనమ్,
తస్మై, కుర్వీత, పక్షీంద్ర,
నమస్కారా, న్ప్రయత్నతః.

65. విష్వక్సేన సంహితలో.

ఓ గరుత్మంతుడా! ఎవని శరీరమున చక్ర ముండునో, వానికి ప్రయత్న పూర్వకముగా నమస్కరింపవలెను.

66. ,, అభ్యంజనాది, భుక్త్యంతం,
యః, కరోతి, సమాహితః.
చక్రాంకితాయ, విప్రాయ,
విష్ణు సాలోక్య, మాప్నుయాత్.

66. ఎవడు చక్రాంకితునకు, శ్రద్ధతో స్నానాది భోజనాంతము జరుపునో వాడు విష్ణు సాలోక్యమును బొందును.

67. విహగేంద్ర సంహితాయాం.

67. విహగేంద్ర సంహితలో.

శ్లో॥ శంఖం, చక్రం, సమారాధ్య,
గంధ పుష్పాదిభి, శ్శుభైః,
తతః, పావక, మభ్యర్చ్య,
జుహుయా, ద్వైష్ణవాహుతీ.

శంఖ, చక్రములను, గంధపుష్పాదులచే పూజించి, అగ్నిపూజ గావించి, విష్ణుమంత్రములతో, హోమములను జేయవలయును.

68. ,, వేదాదిభి, స్తథా, మంత్రైః,
స్రుచైవ, జుహుయా ద్ఘృతమ్ః
చక్రం, చ, పాంచజన్యం, చ
తస్మి, న్నగ్నౌ,వినిక్షిపేత్.

68. వేదాదిమంత్రములచే, స్రుక్కుతో నేతిని హోమము జేసి, ఆయగ్నిలో శంఖ, చక్రముల నుంచవలెను.

69. ,, అగ్నినైవతు, సంయుక్తం,
చక్రమాదాయ మామకం,
దక్షిణం, బాహుమూలం,
స్వం దహేద్విగత సాధ్వసః.

69. అగ్నితో గూడిన చక్రమును దీసి భయములేని వాడై తన కుడిభుజమును తప్తము గావించుకొనవలెను.

,, అథవాఽ న్యే న, కేనాపి,
వైష్ణవేన, మహాత్మనా,
లాంఛితం, బిభృయా, చ్చక్రం,
పాంచజన్యం. తదైవ, చ.

లేదా మహాత్ములగు మఱియొక వైష్ణవులచేత, శంఖ, చక్ర, లాంఛనములను, ధరింపజేయబడవలెను.

70 భారద్వాజ సంహితా పరిశిష్టే ప్రథమాధ్యాయే

70 భారద్వాజ సంహితాపరిశిష్టములో, ప్రథమాధ్యాయమున.

,, విద్యా విభూషణం. పుంసాం,
తస్య, వృత్తం, విభూషణమ్,

పురుషునకు విద్య, భూషణము, [illegible] నడత యలంకారము, నడతకు విష్ణు [illegible]

విష్ణుభక్తి, ర్విభూషా ఽస్య,
సా, చక్రాద్యంక భూషణా,

యలంకారము, భక్తికి, చక్రాంకనమే యలంకారము.

**71. వాసిష్ఠ స్మృతౌ.**

,, తాపాది పంచ సంస్కారీ,
మహా భాగవత, స్మృతః,
చక్రాది హేతి సంతాపః
తాప,ఇత్య భి దీయతే,

**71. వాసిష్ఠ స్మృతిలో.**

తాపాది పంచ సంస్కారములు గలవాడు, మహా భాగవతుడనబడుచున్నాడు. చక్రాదులతో, అంకనమే, తాప మనబడును,

**72. శ్రీ వైఖానసే, భృగుసంహితాయా మర్చనాధికారే, (69) ఊనసప్తతితమోధ్యాయే.**

,, శంఖ, చక్రే, సమాదాయ,
సమభ్యర్చ్య, యథావిధిః.
తస్మి న్నగ్నౌ, చ, సంతప్య,
గృహీత్వా, పాణినా, గురుః.

**72. శ్రీ వైఖానసాగమమున, భృగుసంహితలో అర్చనాధికారమున(69 వ అధ్యాయమున.**

శంఖచక్రములను, యథావిధిగా పూజించి, అగ్నిలో, తాపము జేసి, ఆచార్యుడు, తన చేతితో బుచ్చుకొని.

73. ,, శిష్య బాహ్వో, ర్నివేశ్యాఽథ,
విధివ ద్విష్ణు, సన్నిధౌ,
ఆచార్యం, పూజయే, త్పశ్చాత్.
శిష్య, శ్శక్త్యను సారతః

73 శ్రీ విష్ణుసన్నిధిలో శిష్యుని బాహువులపై నుంచవలెను. శిష్యుడు, తన శక్తికొలది ఆచార్యుని పూజించవలెను.

**74. శ్రీ వైఖానసాగమే, అత్రిసంహితాయాం, వర్గాధికారే (71) అధ్యాయే.**

,, శిష్య, మంజలి సంయుక్తం,
భగవ ధ్యాన సంయుతం,
లోహజే, శంఖచక్రే, చ,
అగ్నౌ, కించి, స్ప్రవేశ్య. చ.

**74. శ్రీ వైఖానసాగమే, అత్రి సంహితాయాం,వర్గాధికారే (71) అధ్యాయే.**

భగవధ్యానము జేయుచు, అంజలి జేసి యున్న శిష్యునికి, లోహ శంఖచక్రముల నగ్నిలో నుంచి.

75. ,, ఇతి, జప్త్వా, "పవిత్రం తే",
కించి, త్త ప్త్వా, సమాచరేత్,
చక్ర మాదాయ హస్తేన,
ధారయే, ద్దక్షిణే, భుజే.

75. "పవిత్రం తే" అను మంత్రమును జపించుచు తపింప జేసిన చక్రమును కుడిభుజముపై ధరింపజేయవలెను.

76. ,, ఆదాయ- శంఖం సాలం చ,
ధారయిత్వా, భుజే, తరే,
ధారయిత్వో ర్ధ్వ పుండ్రం, చ,
తస్య, నామ, ప్రశంసయేత్.

76. శంఖమును యెడమ భుజముపై ధరింపజేసి, ఊర్ధ్వ పుండ్రములను, దాస్యనామమును ధరింపజేయ వలయును.

77. <u>శ్రీ వైఖానసాగమే, మరీచిప్రోక్తానంద సంహితాయాం, (45) అధ్యాయే.</u>

77. <u>శ్రీ వైఖానసాగమమున, మరీచిప్రోక్తమగు ఆనంద సంహితలో (45) అధ్యాయమున.</u>

,, అన్నహోమం, తథా, హుత్వా,
శంఖం, చక్రం, చ, తప్తతః,
పూర్వం, న్యాసాదికం, కృత్వా,
ఋగ్భి, ర్జప్త్వా, కృతే, భుజమ్.

,, సుదర్శనం, రవి రసామ్, ఇతి
ధారయే, ద్భుజయుగ్మయోః,

అన్న హోమముజేసి, శంఖచక్రములను తపింపజేసి, న్యాసాదులను జేసి, ఋక్కులచే జపించి, "సుదర్శనం రవి రసాం" అను మంత్రముచే రెండుభుజములయందును ధరింప జేయవలయును.

78. <u>శాండిల్య స్మృతౌ.</u>

,, స్త్రియా, సహైవ, కర్తవ్యం,
గృహస్థస్య, విధానతః,
సంస్కారపంచకం, తేన,
భవే, త్సా ధర్మచారిణీ.

78. <u>శాండిల్య స్మృతిలో.</u>

గృహస్థునకు భార్యతో సహా విధిగా, పంచ సంస్కారములను జేయవలయును. అట్లు గావించిననే సహధర్మచారిణి యగును.

79. ,, తాపాది పంచ సంస్కారాః,
గృహస్థస్య, యథావిధిః,

79. గృహస్థున కాచార్యుడు, యథావిధిగా స్వగృహ్య సూత్రోక్త విధానముతో తాపాది

ఆచార్యేణ, ద్వయం, కార్యం,
స్వగృహోక్త విధానతః.

పంచ సంస్కారములను జేయవలయును.

80. పారాశర్యస్మృతౌ.

,, ప్రథమం తాపసంస్కారం,
పావనం మునిభి స్మృతం,
సర్వాశ్రమేషు వసతాం,
స్త్రీణాం చ ద్విజసత్తమ.

80. పారాశర్య స్మృతిలో.

అన్ని యాశ్రమముల వారికి, స్త్రీలకు, తాప సంస్కారము ముఖ్యమైనదిగా మునులు జెప్పుచున్నారు.

81. ,, అగ్ని తప్తేన, చక్రేణ,
బాహుమూలే, చ, లాంఛితాః,
తే, యాంతి, పరమం,స్థానం,
పున రావృత్తి వర్జితమ్.

81. తప్త చక్రముచే లాంఛితులగువారు, పునరావృత్తి లేని, పరమ పదమును బొంద గల్గుదురు.

82. ,, అగ్ని నైవ, తు, సంతప్తం,
చక్ర, మాదాయ, వైష్ణవమ్.
దాహయే, త్సర్వ వర్ణానామ్,
విష్ణు సాలోక్య సిద్ధయే.

82. అన్ని వర్ణముల వారికి, విష్ణు సాలోక్య సిద్ధి కొరకు, అగ్ని తప్తమగు చక్రముచే, అంకనము జేయవలయును.

83. ,, దక్షిణే, తు, భుజే, విప్రో,
బిభృయా, ద్వై, సుదర్శనమ్,
సవ్యే, తు, శంఖం, బిభృయా,
దితి, బ్రహ్మ విదో విదుః.

83. కుడిభుజమున చక్రమును, ఎడమ భుజమున, శంఖమును, ధరించవలె నని, బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

84. ,, చక్రాంకితాయ, విప్రాయ,
స్వ భోజ్యాన్నం, దదాతి, యః,
తదన్నం. మేరుతుల్యం, స్యాత్.
అశ్నుతే, దివి, దేవవత్.

84. చక్రాంకితుడగు విప్రునకు భోజనము బెట్టినచో నది మేరువు తో తుల్యమగును. దానిని దేవతలవలె స్వర్గముననను భవించును.

85. వృద్ధ మనుస్మృతౌ.

,, ఊర్ధ్వపుండ్రం తథా చక్రం,
నిత్యం. ధారయతే, నరః,
తేన, తస్యాశుభం, నశ్యేత్,
శుభ, మస్య, వివర్ధతే.

85. వృద్ధమనుస్మృతియందు.

ఊర్ధ్వ పుండ్ర చక్రాంకనములను,ధరించిన వాని కశుభములన్నియు నశించి,శుభములు చేకూరును.

86 విష్ణు స్మృతౌ.

,, బ్రాహ్మణ, క్షత్రియో, వైశ్యః,
శూద్రో, శ్చ, శ్రద్ధయాన్వితః,
చక్రం, చ, పాంచజన్యం, చ,
బిభృయా, దగ్నిసంయుతమ్.

86 విష్ణుస్మృతిలో.

శ్రద్ధగలవారై, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరును, అగ్నితప్తము లగు శంఖ, చక్రములను ధరించవలెను.

87. యమస్మృతౌ.

,, ఉపవీతీ, శిఖాయుక్తః.
చక్ర లాంఛన సంయుతః,
చక్ర లాంఛన, హీనస్య,
విప్రస్య, విఫలాః, క్రియాః.

87. యమ స్మృతిలో.

శిఖా యజ్ఞోపవీతములును, శంఖ, చక్ర, చిహ్నములును, లేని విప్రుని కర్మలన్నియు నిష్ఫలములు.

88. సనక స్మృతౌ

,, విష్ణో ర్నుకేతి, మంత్రేణ,
తాపయిత్వా, సుదర్శనమ్,
చరణం, పవిత్రమితి,
ద్వాభ్యాం తదభిమంత్రయేత్

88 సనక స్మృతిలో

విష్ణో ర్నుకమను మంత్రముచే చక్రమును తాపమును జేసి "చరణం పవిత్ర"మను రెండు మంత్రములచే నభిమంత్రింపవలెను.

89. ,, పవిత్రం తే, వితత మితి,
ముద్రయే, ద్దక్షిణే, భుజే,
జ్ఞానం వైరాగ్య, మాస్తిక్యం,
శ్రద్ధా, చాస్యా ఽభివర్ధతే

89 "పవిత్రం తే వితత"మను మంత్రముచే కుడిభుజమున ముద్రింపవలెను. దీని వలన జ్ఞానవైరాగ్యములు ఆస్తిక్య శ్రద్ధలు వృద్ధిని బొందును.

# చక్రాంకన విషయమున ఇతిహాస ప్రమాణములు

90 శ్రీమహాభారతే, భీష్మపర్వణి, దేవగుహ్యే

శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియైః, వైశ్యైః,
శూద్రైశ్చ, కృతలక్షణైః,
అర్చనీయశ్చ, సేవ్యశ్చ,
నిత్యయుక్తైః, స్వకర్మసు

90. శ్రీ మహాభారతమున, భీష్మపర్వమున, దేవగుహ్యమందు.

చక్రాంకనపరులును, నిత్యయుక్తులునగు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గు వర్ణములవారిచేతను, అన్ని కర్మల యందును, శ్రీ మహావిష్ణువు, పూజింప దగినవాడగుచున్నాడు.

91. ఇతిహాస సముచ్చయే, ద్వాత్రింశాధ్యాయే.

శ్లో॥ కేచిచ్చక్రాంకితా, స్తత్ర,
ప్రాణినః, పుణ్యదర్శనాః,
విచరన్తి యథాకామమ్.

91. ఇతిహాస సముచ్చయమున, ద్వాత్రింశాధ్యాయములో

అచట పుణ్యదర్శనులగు కొందరు చక్రాంకితులు, స్వేచ్ఛగా తిరుగుచున్నారు.

# తప్తచక్రాంకన విషయమున పురాణ, ప్రమాణములు

92. పాద్మపురాణే

శ్లో॥ ధారయే ద్విష్ణుభక్త స్తు,
చక్రం బాహౌ తు దక్షిణే,
వామే, తు శంఖరాజానం,
ధారయే ద్విష్ణు మాప్నుయాత్.

92. పద్మపురాణమున.

విష్ణుభక్తుడు, కుడిభుజమున చక్రమును, ఎడమ భుజమున శంఖమును ధరించినచో, విష్ణువును బొందుచున్నాడు.

93. ,, చక్రాంకితో విద్వాన్.
వాసుదేవం, సమాశ్రయేత్,

93. చక్రాంకితుడైన విద్వాంసుడే వాసు దేవు నాశ్రయించి, భక్తిగలవాడై బ్రహ్మ

భావభక్త్యం సమాస్థాయ,
బ్రహ్మలోకం ప్రయాస్యతి.

లోకమును బొందును.

94. ,, శంఖచక్రాంకనం కుర్యాత్,
బ్రాహ్మణో బాహుమూలయోః.
హుతాగ్ని నైవ సంతప్య,
సర్వ పాపాపనుత్తయే.

94. బ్రాహ్మణుఁడు, పాపములన్నియు పోవుటకు, హోమాగ్ని తప్తమగు, శంఖచక్రములను, భుజములయందు ధరింపవలెను.

95. ,, అగ్నితప్తం పవిత్రంచ,
ధృత్వా వై బాహుమూలయోః,
త్యక్త్వా యమపురం ఘోరం,
యాంతి విష్ణోఃపరం పదమ్.

95. అగ్నితప్తమగు చక్రమును, భుజమున ధరించినవాడు ఘోరమగు యమపురమును వదలి, పరమపదమును బొందును.

96. ,, అగ్నితప్తేన చక్రేణ,
బ్రాహ్మణో బాహుమూలయోః,
అంకయిత్వా జపేన్మంత్రం,
సంసారా ద్మోక్షభా గ్భవేత్.

96. అగ్నితప్తమగు చక్రమును భుజమున ధరించి, మంత్రమును జపించు బ్రాహ్మణుడు, మోక్షమును బొందును.

97. ,, సుదర్శనం ధారయిత్వా,
వహ్నితప్తం ద్విజోత్తమ,
ఉపనీయ విధానేన,
పశ్చాత్కర్మసు యోజయేత్.

97. ద్విజుడు, వహ్నితప్తసుదర్శనమును,ధరింపజేసి, ఉపనయనము జేసిన, తరువాత కర్మలలో నియోగించవలెను.

98. ,, అగ్నితప్తేన చక్రేణ,
బాహుమూలే తు లాంఛితాః,
తే సర్వేపాపనిర్ముక్తాః,
యాంతి విష్ణోః పరంపదమ్

98. అగ్నితప్తమగు చక్రముచే భుజముల యందంకితులగు వారు, సర్వపాపములను వీడి, పరమ పదమును బొందుచున్నారు.

99. ,, హుతాగ్ని తప్తచక్రేణ,
శరీరం యస్య చిహ్నితమ్।

99 హోమాగ్నితప్తమగు చక్రముచే చిహ్నితుడగు వాని, తీర్థములు, యజ్ఞములు ఫలిం

తస్య తీర్థాని యజ్ఞాస్య
ఫలం తే నాత్ర సంశయః॥

చుచున్నవి. సంశయము లేదు.

100 ,, తప్తేనైవాంకనం కుర్యాత్,
బ్రాహ్మణస్య విధానతః,
శ్రౌతస్మార్తాది సిద్ధ్యర్థమ్,
మంత్రసిద్ధ్యై తథైవచ॥

100. శ్రౌతస్మార్త కర్మసిద్ధి కొఱకును, మంత్ర సిద్ధి కొఱకును, బ్రాహ్మణునకు, విధివిహిత ముగా తప్తచక్రాంకనము జేయవలెను.

101 , వైష్ణవత్వస్య సిద్ధ్యర్థమ్,
జ్ఞాన సిద్ధ్యై విశేషతః.
తాపయే చ్ఛంఖ చక్రాభ్యామ్,
హుత్వా, హోమం విధానతః॥

101. వైష్ణవత్వము సిద్ధించుటకును, జ్ఞాన సిద్ధి కిని విధిప్రకారము, హోమముజేసి, శంఖ చక్రములచే తాపమును జేయవలెను

102 ,, సర్వా శ్రమేషు వసతాం,
బ్రాహ్మణానాం, విశేషతః॥
విధినా వైష్ణవం చక్రం,
ధార్యం హి శ్రుతి బోధనాత్॥

102. అన్ని యాశ్రమములలో నున్న బ్రాహ్మ ణులకును, విధిగా విష్ణు చక్రము ధరింపదగిన దని శ్రుతి చెప్పుచున్నది.

103 ,, యే కంఠలగ్నతులసీ, నళినాక్షమాలాః
యే బాహుమూల పరిచిహ్నిత శంఖ చక్రాః,
యేవా లలాటపలకే లసదూర్ధ్వపుండ్రాః,
తే వైష్ణవాః భువన మాశు పవిత్ర యన్తి॥

103 కంఠమున తులసి, తామరపూసల మాలి కలను ధరించువారును, భుజములపై శంఖ చక్రములుగలవారును, ముఖమున నూర్ధ్వ పుండ్రము గలవారునగు వైష్ణవులు లోక మును పవిత్రము జేయుచున్నారు

104 ఆగ్నేయె

,, పంచాయుధాని ధార్యాణి,
భక్తి శ్రద్ధోప బృంహితైః,

104. ఆగ్నేయ పురాణమున

భక్తి శ్రద్ధలతో, ముఖమున, శిరస్సున హృదయమున, బాహువులయందు, పంచా

లలాటే మూర్ధ్ని హృద్బాహ్వోః,
రేకత్రైకం పృథక్పృథక్॥

ధములలో నొక్కొక్కటొక్కొక్క స్థలమున ధరింపవలెను.

105. భవిష్యత్పురాణే.

శ్లో॥ చక్రాంకితస్య సాన్నిధ్యే,
తపః కుర్యాత్ప్రయత్నతః,
స్నానం దానం జపోహోమః.
తత్సర్వం చాక్షయం భవేత్.

105. భవిష్యత్పురాణమున

చక్రాంకితుని సన్నిధిలో తపస్సు జేయవలెను. అచట జేసిన స్నానదాన జపహోమాదులన్నియు నక్షయములగును

106 శ్లో॥ సంవత్సరేణ యత్పాపం,
మనసా కర్మణా కృతమ్,
తత్సర్వం నస్యతే తేషాం,
సకృ చ్చక్రాంకదర్శనాత్.

106. ఒకసారి చక్రాంకనమును జూచినవారి కొక సంవత్సరములో మనోవాక్కాయముచే జేయబడిన పాపము లన్నియు నశించును

107. ,, జ్వర దాహ భయం చైవ,
చోరాగ్నిజ భయం తథా,
తత్సర్వం ప్రశమం యాతి,
యత్ర చక్రాంకితో వసేత్.

107. చక్రాంకితుడున్నచోట జ్వరభయము, చోరాగ్నిభయము, దాహభయము మొదలగు భయములన్నియు, శాంతించును.

108 ,, యో నరో మమ భక్తస్తు,
దివ్యచిహ్నాని ధారయేత్,
శ్వపాకోఽథగోఘ్నోవా,
మమలోకం స గచ్ఛతి

108, పంచముడైనను, తురుష్కుడైనను, నా భక్తుడై, చక్రాది చిహ్నముల ధరించినచో, వాడు నాలోకమును, పొందును

109. బ్రహ్మకైవర్త పురాణే

శ్లో. చక్రాంకిత భుజం విప్రం,
యో దూషయతి సర్వదా,
స యాతి నరకం ఘోరం,
యావదాభూత సంప్లవమ్.

109. బ్రహ్మకైవర్త పురాణమున.

చక్రాంకితుడగు వాని దూషించువాడు, మహాప్రళయము వరకును, ఘోరనరకమును బొందును,

110. శ్రీ వరాహే.

,, మచ్చక్రాంకిత దేహో యో
మద్భక్తో భువి దుర్లభః.

110 శ్రీ వరాహపురాణమున.

నా చక్రాంకిత భుజుడగు పరమ భక్తుడు, దుర్లభుడు

111. ,, చక్రాంకిత భుజాః కేచిత్,
యత్ర యత్ర వసంతి హి,
యోజనాని తథా త్రీణి,
మమ క్షేత్రం వసుంధరే.

111, ఓ భూదేవీ! చక్రాంకితు లుండినచోటు నుండి, మూడామడవరకును, నాక్షేత్రమగును.

112. ,, యే కేచి ద్యత్ర పురుషాః,
విష్ణు చక్రాంక ముద్రితాః.
తేషాం దర్శన మాత్రంతు
మహాపాతక నాశనమ్.

112. ఎచటనైనను, చక్రాంకితులగు పురుషుల దర్శనము గల్గినంత మాత్రముననే మహాపాపములు నశించును.

113. ,, భూతప్రేత పిశాచాశ్చ,
ఢాకిన్య శ్చ వసుంధరే.
తత్సర్వం ప్రశమం యాతి,
యత్ర చక్రాంకితో వసేత్.

113. ఓ భూదేవీ! చక్రాంకితు డున్నచోట, భూత, ప్రేత, పిశాచ, ఢాకిన్యాదులన్నియు శాంతిని బొందును

114. లింగపురాణే

,, అష్టాక్షర విద స్సర్వే,
విష్ణు చక్రాంకితా స్తథా,
సేవకా వాసుదేవస్య,
తే దైవ నట నర్తకాః.

114. లింగపురాణమున.

వాసుదేవుని సేవకులందు నటనర్తకులును, చక్రాంకితులును, అష్టాక్షర మంత్రము నెఱిగిన వారును, గావలెను

115. స్కాందపురాణే.

,, గోవిన్దస్యా యుధాన్యంగే,
బిభ్ర త్సుశ్రోణి, వై ద్విజః,

115. స్కాంధపురాణము.

ఓ పార్వతీ! గోవిందుని యాయుధములను ధరించిన ద్విజుడు, పూజ్యుడై [illegible]

తురీయం ధామ తద్విష్ణోః
మహిష్టంః ప్రాప్నుయా దితి.

116 శ్లో. యేషాం చక్రాంకితం గాత్రం,
శూద్రేష్వపి చదృశ్యతే,
తే వై స్వర్గస్య నేతారో,
బ్రాహ్మణా భువి దేవతాః

117. ,, చక్రాంకిత భుజా స్సర్వే,
ప్రహ్లాదేన ధృవేన చ,
విభీషణేన బలినా,
రుక్మాంగద, శుకేన చ.

118 ,, మాంధాత్రా హ్యంబరీషేణ,
మార్కండేయ ముఖైః,
చక్రాది చిహ్నైస్సర్వైః.

119. ,, ఋషయ సిద్ధ గంధర్వాః,
పాతాళే పన్నగేశ్వరాః,
వహ్నౌ తప్తం హరేశ్చక్రం.
శంఖం చైవ విధానతః

120. గారుడపురాణే.

,, విష్వక్సేన స్స్వయం చక్ర
మాదాయా త్మవిభూషణమ్,
ప్రయచ్ఛతి మహాతేజా,
హరిభక్తా నుకంపయా

121 ,, విష్ణు చక్రాంకితం గాత్రం,
పవిత్రమితి వై శ్రుతిః.

మును బొందును.

116 శూద్రులైనను, చక్రాంకితులగుచో. స్వర్గమున బొందింతురు. వారే యిలలో మున బ్రాహ్మణులును, దేవతలును

117 ప్రహ్లాదుడు, ధృవుడు, విభీషణుడు, బలి, రుక్మాంగదుడు, శుకుడు, మొదలగు వారందరు చక్రాంకితభుజులు,

118 మాంధాత, అంబరీషుడు, మార్కండేయుడు, మొదలగు వారందరు, చక్రాంకితులే

119. ఋషులు, సిద్ధులు, గంధర్వులు, పాతాళములో నుండు, పన్నగులు, అగ్నితప్తమగు హరిచక్రమును, శంఖమును, విధివిహితముగా ధరించిరి.

120 గరుడపురాణమున

విష్వక్సేనుడు తన యాభరణమగు చక్రమును దీసికొని, హరిభక్తులకు, దయతో నిచ్చును.

121. విష్ణుచక్రాంకితమగు శరీరము పవిత్రమని, శ్రుతి జెప్పుచున్నది, ద్విజులు హస్త

చక్రాంకితాయ దాతవ్యం,
హవ్యం కవ్యం ద్విజోత్తమైః.

కవ్యములను, చక్రాంకితులకే, ఇవ్వవలెను.

## 122. మత్స్యపురాణే

శ్లో॥ చక్రాంకితభుజాః కేచిత్।
శంఖాంకిత భుజా స్తథా,
శంఖచక్రధరాః కేచిత్,
కువే విష్ణు పరిగ్రహే

## 122. మత్స్యపురాణమున

122. వైష్ణవకులమున కొందరు, చక్రచిహ్నముగల, భుజములు గలవారును, కొందరు, శంఖధారులును, కొందరు, శంఖచక్రధారులునై యున్నారు.

123. ,, శంఖ చక్రాంకనం కుర్యా,
దాత్మనో బాహుమూలయోః,
కళత్రా పత్య భృత్యేగు,
పశ్వాదిషు చ ముక్తయే.
నైవాప్నోతి, వశంమృత్యో,
రస్యాజ్ఞాభంగ కృన్నరః

123. తన, భార్యా బిడ్డలు, సేవకులు, పశువులు, ముక్తి నొందుటకై, భుజములయందు శంఖచక్రాంకనమును, జేయవలయును అట్టివారు విని నతిక్రమించినను, మృత్యువునకు వశము గారు

## 124. బ్రహ్మాండపురాణే.

,, నారాయణాయుధై ర్నిత్యం,
చిహ్నితో యస్య విగ్రహః
పాపకోటి శతం దగ్ధం,
తస్మిన్దృష్టే భవే త్సదా.

## 124 బ్రహ్మాండ పురాణమున.

నారాయణాయుధాంకితమగు శరీరము. గలవానిని, జూచిన నో, పాపకోటులు నశించును

125. ,, శంఖ చక్రోర్ధ్వపుండ్రాది
ధారయే ద్బ్రాహ్మణ స్సదా,
శ్రాద్ధాది సర్వ కర్మార్హః,
ఇత్యుక్తః; కిమతః పరమ్.

125. శంఖచక్రోర్ధ్వ పుండ్రములను, బ్రాహ్మణు డెప్పుడును. ధరించియుండవలెను అట్టివాడే శ్రాద్ధాదికర్మలకన్నిటికిని తగినవాడగును.

126. హరివంశే.

,, నాఽముద్రితాః ప్రవేష్టవ్యా,
యావ ద్దాగమనం మమ,
చక్రాంకితాః, ప్రవేష్టవ్యాః,
యావ దాగమనం మమ.

126 హరివంశమున.

చక్రాంకితులైన వారిని మా త్రి మే నే వచ్చువరకును లోనికి రానిమ్ము, చక్రాంకితులు కాని వారిని నేను వచ్చువరకు లోనికి రానివ్వకుము (అని శ్రీ కృష్ణుడు తన ద్వారపాలకు లకాజ్ఞాపించినాడు.)

127. బ్రాహ్మే.

,, అగ్నితప్తం పవిత్రం చ,
ధృత్వా బాహుమూలయోః,
త్యక్త్వా యమ పురం ఘోరం,
యాతి విష్ణోః పరంపదం.

127. బ్రహ్మపురాణమున.

తప్తచక్రాంకనము గలవాడు, ఘోరమగు, యమపురము నుదాటి, విష్ణులోకమగు, పరమపదమును, బొందుచున్నాడు

128. మార్కండేయే.

,, ధారయే ద్విష్ణుభక్తస్తు,
చక్రం బాహౌ తు దక్షిణే
వామే తు శంఖరాజానం
వైష్ణవం పదమా ప్నుయాత్,

128. మార్కండేయపురాణమున.

కుడిభుజమున, చక్రమును, ఎడమ భుజమున శంఖమును, ధరించు విష్ణు భక్తుడు, విష్ణు పదమును బొందును.

129 వామనే

,, ఏలయాపి లిఖే ద్యస్తు,
బాహుమూలే సుదర్శనమ్,
కులకోటిం సముద్ధృత్య,
స గచ్ఛే త్పరమాంగతిమ్.

120 వామనపురాణమున.

విలాసము గానైనను, భుజములయందు, చక్రములను వ్రాసుకొనువాడు, కోటి, కుల పురుషుల నుద్ధరించి,పరమపదము నొందును.

130 కూర్మే,

,, చక్రాదిధారణం పుంసాం,
పర సంబంధ వేదనమ్,

130. కూర్మపురాణమున.

పురుషులకు చక్రాంకినము, పరమాత్మ సంబంధమును దెల్పును, గాజులు మోద

పాతివ్రత్య నిమిత్తం హి,
వలయాది విభూషణమ్.

లగు నగలు, పతివ్రతయని దెల్పుట కేగ్గదా॥

131. బృహన్నారదీయే.

శ్లో॥ సుదర్శనేన యస్యాంగం,
లాంఛితం తు భవే త్సదా,
దేహే తస్య వసే న్నిత్యం,
శ్రియాయుక్త స్స్వయం హరిః.

131. బృహన్నారదీయమున.

చక్రలాంఛితమగు శరీరముగలవాని దేహమున లక్ష్మితో గూడిన విష్ణువునివసించును.

132. ,, చక్రాయు ంకితం దృష్ట్వా,
యమోఽపి హృది శంకితః
ప్రణామం దూరతః కృత్వా,
విష్ణుభక్తం విమత్సరమ్,

132 చక్రాంకితుడగు, విష్ణుభక్తుని జూచి. యముడును భయపడినవాడై, నమస్కరించి దూరముగా బోవును.

133. ,, చక్రాంకితాయ విష్ణపాయ,
విష్ణుభక్తాయ ధీమతే,
భిక్షా మాత్రప్రదానేన
వైష్ణవీం గతి మాప్నుయాత్,

133. చక్రాంకితుడగు విష్ణుభక్తునకు, బిచ్చమిడినను, విష్ణులోకమున కేగును.

134, ,, వహ్నితప్తేన చక్రేణ,
బాహుమూలే తు లాంఛితాః,
సర్వపాప వినిర్ముక్తాః,
భవిష్యన్తి శ్వరోపమాః.

134. తప్తచక్రాంకితులగు వారు పాపనిర్ముక్తులై విష్ణువుతో సమానులగుచున్నారు.

135. ,, అగ్నితప్తేన, చక్రేణ,
బాహుమూలే తు లాంఛితః,
రౌరవాత్కుల ముద్ధృత్య,
విష్ణులోకే మహీయతే.

135 తప్త చక్రాంకిత, భుజుడగువాడు, రౌరవనరకము నుండి, కులము నుద్ధరించి, విష్ణులోకమున పూజ్యుడగుచున్నాడు.

136. మోక్షధర్మే.

శ్లో॥ సగోత్రమపి యశ్శూద్రే,
చక్రాంకితభుజం చరేత్,
రౌరవా త్కుల ముద్ధృత్య,
విష్ణులోకే మహీయతే.

136. మోక్షధర్మమున.

సగోత్రుడైనను చక్రాంకితుని, శూద్రముల లో నియమించు వాడు, కులమును రౌరవము నుండి యుద్ధరించి విష్ణులోకమున పూజ్యు డగుచున్నాడు.

137 ఆదిత్యపురాణే.

,, చక్రాది ధారయే ద్విప్రో,
లలాటే మస్తకే భుజే,
పాతకాది విశుద్ధ్యర్థమే
భవ క్లేశ వినాశనమ్

137. ఆదిత్యపురాణమున

విప్రుడు ముఖమున శిరమున భుజములయందు, చక్రాదులను ధరించినచో పాపములు బోవును, సంసారక్లేశము నశించును.

138. విష్ణురహస్యే.

,, వైష్ణవా మునయ స్సర్వే.
విష్ణుచక్రేణ ముద్రితాః.
తేషాం దర్శన మాత్రేణ,
మహా పాతక నాశనమ్

138. శ్రీ విష్ణురహస్యమున.

చక్రాంకితులగు వారందరును మునులు, వారి దర్శనమే మహాపాతకములనునశింపజేయును.

139. ,, అతి పాప ప్రసక్తోఽపి
విష్ణు చక్రాంకితస్య తు,
పాదోదకం పిబేద్య స్తు,
సర్వపాపైః, ప్రముచ్యతే.

139. మహాపాపియైనను, చక్రాంకితుని పాదోదకమును, త్రాగువాడు పాపములన్నియు బోయిన వాడగుచున్నాడు.

140. కాశీఖండే

,, బ్రాహ్మణ క్షత్రియో వైశ్యః,
శూద్రో నారీ తధేతరః,
శంఖ ముద్రాంకిత తనుః,
తులసీ మంజరీ ధరః.

140. కాశీ ఖండమున.

బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యులును, శూద్రులును స్త్రీలును, ఇతరులును, చక్రాంకిత నపులును, తులసిమాలికలను ధరించిన వారును, గావలెను

141. శిల్పిశాస్త్రే.

,, భుజే చక్రం ద్విజాతీనాం,
శిర శ్చక్రంతు దైవతమే.
అచక్రద్విజదేవానాం,
పూజాదానం చ నిష్ఫలమ్.

141 శిల్పిశాస్త్రమున,

ద్విజాతులకు భుజమునను, దేవతలకు శిరమునను, చక్రముండవలెను. చక్రములేని, దేవ బ్రాహ్మణులకు, జేయుపూజ దానములు నిష్ఫలము లగును.

142. బ్రహ్మాండేరుద్రః.

,, సాక్షా ద్విష్ణు సామీప్యం,
మృత పిత్రాలభేత్స దా,
విష్ణు చక్రాంకితం దృష్ట్వా,
యో భ్యుద్ధాయకృతాంజలిః
స్వకీయం కుల ముధృత్య,
బ్రహ్మలోకే మహీయతే.

142 బ్రహ్మాండపురాణమున. రుద్రుడు,

చక్రాంకితుని జూచి లేచి నమస్కరించినవాడు. తన పితురులతో, విష్ణు సామీప్యమును, బొందును. తనకులము నుద్ధరించి, బ్రహ్మలోకమున పూజ్యుడగుచున్నాడు.

143 ,, చక్రాంకిత భుజా యస్మిన్,
పఙ్త్తి మధ్యే తు, భుంజతే,
సాపఙ్త్తి సర్వలోకేషు,
దేవ పఙ్త్తిషు గీయతే.

143. చక్రాంకిత భుజులు పంక్తి మధ్యలో భుజించినచో, ఆపంక్తి దేవలోకమున స్తోత్రము జేయబడుచున్నది.

144. ,, బ్రహ్మచారీ గృహస్థోఽధ,
వానప్రస్థో ఒధ భిక్షుకః,
అవశ్యం ధారయే చ్చక్రం,
అగ్నితప్త మతంద్రితాః

144. బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వాన ప్రస్తుడుగాని. సన్యాసిగాని,తప్తచక్రమును తప్పక ధరించవలెను.

145. వారాహే.

,, అంకయే చ్ఛంకచక్రాభ్యాం,
దక్షిణేతర పార్శ్వయోః,

145. వరాహపురాణమున.

శంఖ చక్రములచే, కుడి యెడమ భాగములయందు, అంకనము జేయవలెను.

తద్ధారణా న్మహాపాపాత్
ముచ్యతే నాత్ర సంశయః.

శంఖచక్రములను ధరించినచో మహాపాపములు నశించును, సందేహములేదు.

146. ,, వాసుదేవాంకనం కుర్యా
దాత్మనో బాహుమూలయోః
సోఽశ్వమేధఫలం ప్రాప్య
విష్ణులోకే మహీయతే.

146 విష్ణుచక్రాంకనము తన బాహుమూలముల యందు ధరించినవాడు, అశ్వమేధఫలమును బొంది విష్ణులోకమునపూజ్యుడగుచున్నాడు.

## తప్త చక్రాంకనము లేనిచో దోషమునుజెప్పు ప్రమాణములు

147. పరాశరస్మృత్యుత్తరఖండే.

శ్లో॥ చక్రలాంఛన హీనస్య
ద్విజత్వం నిష్ఫలం భవేత్

147. పరాశరస్మృతిలో నుత్తరఖండమున.

చక్రాంకితుడుగాని విప్రుని ద్విజత్వము నిష్ఫలము.

148. ,, అచక్రధారిణం విప్రం
యశ్శ్రాద్ధే భోజయే న్నరః
రేతో మూత్ర పురీషాణి
స పితృభ్యః ప్రయచ్ఛతి.

148 చక్రాంకితుడు గాని వానికి పితృకర్మలలో భోజనము బెట్టినచో పితరులకు రేతో మూత్రపురీషములను బెట్టినట్లగును.

149. ,, శంఖ చక్రోర్ధ్వ పుండ్రాది
రహితో బ్రాహ్మణాధమః
జీవ న్నేవ స చండాలః
సర్వకర్మసు గర్హితః.

149 శంఖ, చక్ర, ఊర్ధ్వపుండ్రములులేని బ్రాహ్మణు డధముడు, చండాలునితో సమానుడు, ఏకర్మకును బనికిరాడు.

150 ,, వినా యజ్ఞోపవీతేన
వినా చక్రస్య ధారణాత్
వినా ద్వయేన వై విప్రః
చండాలత్వ మవాప్నుయాత్.

150. జందెము, చక్రాంకనము, ద్వయము లేని విప్రుడు చండాలు డగును.

151. ,, చక్ర లాంఛన హీనేన
కృతం కర్మ చ నిష్ఫలమ్॥

151. చక్రాంకనము లేని వాడు జేసిన కర్మ నిష్ఫలము.

152. హారీతస్మృతౌ.

హారీతస్మృతియందు.

,, అచక్రధారీ యో విప్రః
బహు వేద శ్రుతోపి వా
జీవ న్నేవ స ఛండాలో
మృతో నిరయ మాప్నుయాత్

152. చక్రాంకనములేని విప్రుడు, వేదశాస్త్రముల జదివినను ఛండాలుడే. నరకమును గూడ బొందును.

153. ,, అనంకయిత్వా చక్రేణ
యత్కించిత్కర్మ సంచరేత్
తత్సర్వం యాతి విఫల
మిష్టా పూర్తాధికం నృప.

153. చక్రాంకనము లేక చేసిన యిష్టాపూర్తాది కర్మ లన్నియు నిష్ఫలములై పోవును.

154. ,, అచక్రధారీ విప్ర స్తు
సర్వకర్మ బహిష్కృతః
అవైష్ణవత్వ మాపన్నో
మృతో నిరయ మాప్నుయాత్

154. చక్రాంకనములేని విప్రుడు, ఏ కర్మకును పనికిరాడు. అవైష్ణవుడై నరకమును బొందును.

155. ,, చక్రాది చిహ్న రహితం
ప్రాకృతం కలుషాన్వితం
అవైష్ణవం తు తం దూరాత్
శ్వపాక మివ సంత్యజేత్.

155. చక్రాది చిహ్నములు లేని ప్రాకృతుడు పాపి. విష్ణు సంబంధము లేనివాడు. ఛండాలుని వలె వానిని దూరముగా విడువవలెను.

156. ,, అవైష్ణవ స్తు యో విప్రః
సర్వ కర్మ యుతోపి వా
స పాషండే తి విజ్ఞేయః
సర్వ కర్మసు గర్హితః

156. చక్రాంకనము లేని విప్రుడు, కర్మలనన్నిటిని జేసినను, పాషండుడగును, ఏ కర్మకును పనికిరాడు.

157. ,, అవైష్ణవస్తు యో విప్రః
శ్వపాకా దధమ స్స్మృతః
అశ్రాద్ధే యో హ్యపాంక్తేయో
రౌరవం నరకం వ్రజేత్

157. చక్రాంకనము లేని విప్రుడు ఛండాలుని కంటె నీచుఁడు. శ్రాద్ధములకును, పంక్తికిని పనికిరాడు. రౌరవనరకము నొందును.

158. ,, శంఖ చక్రోర్ధ్వపుండ్రాది
రహితం బ్రాహ్మణం నృప
యశ్రాద్ధే భోజయే ద్విప్ర
పితౄణాం తస్య దుర్గతిః,

158. శంఖ, చక్రోర్ధ్వపుండ్రాదులు లేని, బ్రాహ్మణుని, శ్రాద్ధములో నిమంత్రణ జేయు వాని పితరులు, దుర్గతి నొందుదురు.

159, ,, క్రతు సాహస్ర యష్టావా
సర్వ శాస్త్రయుతోపివా
అవైష్ణవస్తు యో విప్రః
సఛండాలఇతి స్మృతః,

159. వెయ్యి యాగము లొనరించినను. శాస్త్రములన్నిటిని చదివినను చక్రాంకనములేని విప్రుడు ఛండాలుడగును.

160 వాసిష్ఠస్మృతౌ.

160 వసిష్ఠస్మృతిలో.

,, అన్యేఅవైష్ణవాః ప్రోక్తాః
హీనాస్తాపాదిభిర్ద్విజాః
వేదశాస్త్రేషునిపుణాః
తేవై నిరయగామినః.

వేదశాస్త్రనిపుణులైనను, తాపాది సంస్కారములేని వారు, అవైష్ణవులని చెప్పబడిరి, వారు నరకమును బొందుదురు.

161, ,, తస్మాదవైష్ణవాన్విప్రాన్
న కర్మసు నియోజయేత్

161, అందుచేత చక్రసంస్కారములేనివారిని కర్మలలో నియోగింపరాదు.

162. ,, శంఖచక్రోర్ధ్వ పుండ్రాది
చిహ్నైశ్చ రహితై ర్ద్విజైః
యత్ర యత్కర్మ కుర్వీత
మహాహానిప్రదం భవేత్.

162. శంఖ చక్రోర్ధ్వపుండ్రాది చిహ్నములు లేని బ్రాహ్మణు లెచట నే కర్మ జేసినను అది మహాహానికర మగును.

163. భవిష్యత్పురాణే.

,, చక్రాంకితభుజం దృష్ట్వా
య స్తుతం నాభివాదయేత్
తిర్యగ్యోని శతం ప్రాప్య
విష్టాయాం జాయతే క్రిమిః.

163. భవిష్యత్పురాణమున

చక్రాంకితుడగు వానిని జూచి నమస్కరింపని వాడు నూరు తిర్యగ్యోనుల నొంది మలములో పురుగై పుట్టును.

164. ,, యజ్ఞో దానం తపో హోమః,
భోజనం పితృ తర్పణమ్
చక్రలాంచన హీనస్య
విప్రస్య విఫలం భవేత్.

164 చక్రాంకనములేని విప్రుని యజ్ఞము, దానము, తపస్సు, హోమము, భోజనము, పితృతర్పణము, మొదలగునవి యన్నియును నిష్ఫలములు.

165. ,, తీర్థ స్నాన ఫలం యచ్చ
భూ గో దాన ఫలం తథా,
అవైష్ణవస్య విప్రస్య
సర్వం శశ్వ ద్వినశ్యతి.

165 చక్రాంకనము లేని వాని తీర్థఫలము, భూదాన, గోదాన ఫలమునశించును.

166. ,, రూప లావణ్య సంయుక్తాః
మహా వంశో ద్భవా ద్విజాః
అవైష్ణవా న శోభంతే
నిర్గంధా ఇవ కింశుకాః.

166. రూప లావణ్య యుక్తులును మహావంశోద్భవులైనను,చక్రాంకనము లేని ద్విజులు వాసన లేని మోదుగువలె ప్రకాశింపరు

167. ,, విద్యావినయ సంపన్నాః
విశాల కుల సంభవాః
విష్ణు భక్తి విహీనా యే
చండాల సదృశాస్స్మృతాః.

167. విద్యావినయ సంపన్నులైనను, గొప్ప కులమునబుట్టినను, విష్ణుభక్తి లేనివారు, ఛండాలునితోసమానులు.

168. హరివంశే.

సర్వభూత దయా యుక్తం
వైష్ణవం ద్వేష్టి యో నరః

168. హరివంశమున.

సర్వ భూత దయగలవాడైన, వైష్ణవుని

స ఛండాలో మహాపాపీ
రౌరవం నరకం వ్రజేత్.

ద్వేషించు వాడు, ఛండాలుడు, మహాపాపి రౌరవనరకమును గూడ నొందును.

169. నారదీయపురాణే.

శ్లో॥ శ్రీకృష్ణ చక్రాంక విహీన గాత్రం
శ్మశాన తుల్యం పురుషో ఽథ నారీ
దృష్ట్వా నర స్తన్న్రపతే సవాసాః
స్నాత్వా సమర్చ్య ద్ధరి మంగనిత్యమ్

169. నారదీయపురాణమున.

చక్రాంకనములేని, పురుష శరీరముగాని, స్త్రీశరీరముగాని, శ్మశానముతో సమానము. దాని జూచినచో సచేలస్నానము జేసి, హరిని పూజింపవలెను.

170. ,, చక్ర చిహ్నవిహీనం తు
య శ్శ్రాద్ధే భోజయిష్యతి
వ్యర్థం భవతి తత్సర్వం
నిరాశాః పితరో గతాః.

170. చక్రాంకనము లేని వానిని శ్రాద్ధములో భుజింప జేసినచో నదివ్యర్థమగును, పితరులు, నిరాశులై పోవుదురు.

171. పాద్మే

,, సల్లాపా ద్దర్శనా ద్దానాత్
యజనా ద్వందనా దపి
చక్రాంకితస్య విప్రస్య
విష్ణు సాయుజ్య మాప్నుయాత్.

171. పద్మపురాణమున.

చక్రాంకితునితో మాట్లాడినను చూచినను, దానమిచ్చినను, పూజించినను నమస్కరించినను, విష్ణు సాయుజ్యమును బొందును.

172 ,, తద్ధైవ చక్రహీనస్య
పూజనా ద్వందనాదపి
వైష్ణవో నిరయం యాతి
యావ దాభూత సంప్లవమ్.

172. చక్రాంకనము లేని వానిని పూజించినను, నమస్కరించినను, వైష్ణవుడు ప్రళయకాలమువరకు నరకమును బొందును.

173, ,, అచక్రధారీ యో విప్రః
శ్రుతి స్మృతి యుతోఽపి వా
త్యజే చ్ఛండాల భాండస్థం
తంవిప్ర మమృతం యథా.

173. చక్రాంకనములేని విప్రుడు వేదశాస్త్రములు గలవాడైనను మాలవాని కుండలోని అమృతము వలె విడువదగినవాడు.

174.శ్లో॥ విష్ణుచక్రాంకితం విప్రం
పూజయే చ్ఛ్రాద్ధకర్మణి.
విష్ణు చక్ర విహీనం తు
ప్రయత్నేన వివర్జయేత్

174. శ్రాద్ధములో చక్రాంకితునే పూజింపవలెను. చక్రాంకనములేని వానిని ప్రయత్నపూర్వకముగా విడువలెను.

175. ,, దద్యా ద్గో భూ హిరణ్యాది
చక్రాంకిత భుజాయ వై
యద్దత్తం చక్రహీనాయ
తత్సర్వ మసురాయ వై.

175. గో, భూ, హిరణ్యాది దానములను చక్రాంకితునకే జేయవలెను. చక్రాంకితుడు గాని వానికి జేసిన దానములన్నియు అసురునకు జేసినవగును.

176. ,, అధృత్వా విధినా చక్రం
బ్రాహ్మణః ప్రాకృతో భవేత్
గర్హిత స్సర్వలోకేషు
బ్రాహ్మణ్యా త్ప్రచ్యుతో భవేత్

176. చక్రాంకనములేని బ్రాహ్మణుడు ప్రాకృతుడగును.
సర్వలోకనిందితుడై బ్రాహ్మణ్యము నుండి జారినవాడగును.

177. ,, సర్వ వేద వినీతశ్చ
సర్వ శాస్త్ర విశారదః
అధృత్వా విధినా చక్రం
బ్రాహ్మణః పతితో భవేత్.

177. సర్వవేదములను, శాస్త్రములను జదివినను, చక్రాంకనములేని బ్రాహ్మణుడు పతితుడగును.

178. ,, అచక్రధారిణం విప్రం
దూరతః పరివర్జయేత్
శ్వపాకమివ వీక్షేత
లోకే విప్రమవైష్ణవమ్.

178. చక్రాంకనములేని విప్రుని దూరముగా వదులవలయును. ఛండాలునితో సమానుని గాజూడవలయును.

179. ,, వైష్ణవో వర్ణ బాహ్యోపి
పునాతి భువనత్రయమ్.

179. చక్రాంకితుడు వర్ణము లేనివాడైనను మూడులోకములను పవిత్రము జేయుచున్నాడు.

180. ,, కిమత్రబహునోక్తేన
బ్రాహ్మణా యే హ్యవైష్ణవాః

180. ఎక్కువ మాటలచే నేమిప్రయోజనము

తే వై పాషండినో జ్ఞేయాః
సర్వ లోకేషు గర్హితాః॥

చక్రాంకనములేని బ్రాహ్మణులు, పాషండులు, సర్వలోకనింద్యులు నగుచున్నారు.

181. శ్లో॥ అవైష్ణవా స్తు యే విప్రాః
ఛండాలా అధమా స్స్మృతాః
తేషాం సంబాషణం స్పర్శం
ప్రమాదే నాపి వర్జయేత్॥

181. చక్రాంకనము లేని విప్రులు, చండాలులు, అధములు, వారితో మాట్లాడుట వారిని తాకుట ప్రమాదము గానైనను జేయరాదు.

182. శ్రీ వైఖానసే మరీచిప్రోక్తనంద సంహితాయామ్.

,, యాగే దానే జపే హోమే,
స్వాధ్యాయే పితృకర్మణి।
తప్తముద్రాం వినా కుర్యాత్
సర్వం భవతి నిష్ఫలమ్॥
తస్మా త్సర్వ ప్రయత్నేన,
మంత్రవి త్తప్తముద్రితః॥

182. శ్రీ వైఖానసాగమమున మరీచిప్రోక్త వగు అనందసంహితలో

తప్త చక్రాంకనము లేక చేయుయాగము, దానము,జపము,హోమము,స్వాధ్యాయము, పితృతర్పణము. శ్రాద్ధము మొదలగు కర్మలన్నియు నిష్ఫలములు, అందువలన ప్రయత్నము జేసియైనను మంత్రవేత్త తప్త చక్రాంకితుడు గావలెను.

## కొన్ని చంక్రాకన నిషేధక ప్రమాణములు

183. వామన పురాణే

,, బ్రాహ్మణో యది మూఢాత్మా
తాపయే ద్వహ్ని ముద్రయా
కర్మార్హో న భవే దత్ర
స వై పాషండసంజ్ఞితః॥

183. వామనపురాణమున.

బ్రాహ్మణుడు మూఢాత్ముడై, చక్రాంకనముకంటె అతిరిక్తమైనఅగ్నిముద్రచే,తాపము జేసికొన్నచో,కర్మార్హుడుగాడు పాషండుడనిపించుకొనును.

184 నారదీయే.

,, బ్రాహ్మణస్య తను ర్జ్ఞేయా,
సర్వ వేదమయీ యతః।

184. నారదసంహితలో

బ్రాహ్మణుని శరీరము సర్వవేదమయము చక్రాంకనమున గాక మరొక విధముగ

సా చేత్సంతాపితా యేన,
కిం వక్ష్యామి మహైనసః

దానిని తపింపజేసినచో కలుగుపాపముల నేమని చెప్పగలను.

185. ,, చక్రాంకిత తానూ రాజన్।
తథా లింగాంకితోపి వా
జపే చ్ఛ పౌరుషం సూక్తం
అన్యధా రౌరవం వ్రజేత్॥

185. ఓరాజా! అవైదికవిధానముగ చక్రాంకితుడు గాని, లింగాంకితుడు గాని అయిన వాడు పురుషసూక్తమును జపించవలెను. లేనిచో రౌరవము నొందును.

186 లింగపురాణే.

,, చక్రం శంఖం తాపయిత్వా,
యస్య దేహః ప్రతప్యతే
స జీవ త్కుణప స్త్యాజ్యః
సర్వకర్మ బహిష్కృతః॥

186. లింగపురాణమున.

ఇనుము – మట్టి మున్నగు నిషిద్ధమైనవానిచే శంఖచక్రములను తపింపజేసి యెవని శరీరము తపింపబడునో వాడు జీవచ్ఛవము వలె త్యాజ్యుడు, ఏకర్మకును పనికిరాడు.

187. ఆదిత్యపురాణే.

,, బ్రాహ్మణో యది లోభేన
కుర్యా ద్వై దగ్ధముద్రికాః
తస్య దర్శన మాత్రేణ
కుర్యా త్సూర్యావలోకనమ్॥

187. ఆదిత్యపురాణమున.

బ్రాహ్మడు లోభముచే తప్తముద్రను ధరించినచో వానిని జూచినవెంటనే సూర్యుని జూడవలెను

187. దేవల స్స్మృతౌ.

,, చక్రాంకిత తనూ రాజన్
తథా లింగాంకితో పివా
ఏతై రావేష్టితా పంక్తిః
పాపదా సర్వదా నృణామ్॥

188. దేవలస్మృతియందు

ఓరాజా మోసబుద్ధితో చక్రాంకితులైన వారు గాని లింగాంకితులైనవారు గాని, పంక్తిలో నున్నచో ఆ పంక్తిమానవులకు పాపదాయి యగును.

189. ,, ఏతేషా మన్నభు గ్విప్రః
పాపమేవ సమాశ్రయేత్

189. వీరియన్నమును దిను విప్రుడు పాపమునే బొందును. ఒకచోట భోజనముజేసినచో

ఏకత్ర భోజనే రాజ
చాంద్రాయణ మథాచరేత్॥

చాంద్రాయణమునుచేయవలెను.

ఇట్లుకొన్ని తప్త చక్రాంకనమును నిషేధించు వాక్యము లున్నను, అవి విధివిహితమగు చక్రాంకనమును నిషేధించుటకు బయలుదేరినవిగావు. మోసబుద్ధితోగాని ధనాది ఆశతోగాని విధిరహితముగ గాని చక్రాంకితులైన వారిని గురించి మాత్రమే తెలుపుచున్నవి.గాన యిట్టివాక్యములు విధ్యుక్తముగను మోక్షేచ్ఛ చేతను జరుగు చక్రాంకనమును నిషేధించుట లేదు.

190 విష్ణుస్మృతౌ

శ్లో॥ శంఖచక్రం మృదాయస్తు
కుర్యాత్తప్తాయ సేనవా
స శూద్రవద్బహిష్కార్యః
సర్వస్మాద్ద్విజకర్మణః

190. విష్ణుస్మృతిలో

మట్టితో గాని, ఇనుముతోగాని,చేయించిన శంఖచక్రములచే, సంస్కారము చేసికొనువాడు శూద్రునివలె, సర్వకర్మలనుండియు బహిష్కరింపదగినవాడు. అని అవైదిక విధానమును మాత్రమే నిషేధించుచున్నవి గాని వైదిక విధిని ననుసరించిజరుగు తప్త చక్రాంనమును ఎవరును ఏవాక్యములును ఎంతమాత్రమును నిషేధించుటలేదు.

శిల్పిశాస్త్రమందు

,, శంఖచక్రోర్ధ్వపుండ్రాణి
ధారయేత్ బ్రాహ్మణ స్సదా
శ్రాద్ధాది సర్వకర్మార్థ
మిత్యుక్తం మునిపుజ్గవైః.

,, దక్షిణే తు భుజే విప్రో
బిభృయా ద్వై సుదర్శనమ్

శిల్పిశాస్త్రమున

శంఖచక్రములు, ఊర్ధ్వపుండ్రములును సర్వదాధరించునట్టి బ్రాహ్మణుడే శ్రాద్ధాది సమస్త కర్మలకును అర్హుడగుచున్నాడని మునిపుంగవులు తెలుపుచున్నారు.

విప్రులైనవారు దక్షిణబాహువున సుదర్శన చక్రమును ధరించవలెననియును లలాట

ఊర్ధ్వపుండ్రం తు విప్రాణాం
సతతం శ్రుతి చోదితం.

మున విధ్యుక్తరీతిగ ఊర్ధ్వపుండ్రమును ఎల్లప్పుడును ధరించవలెననియు శ్రుతులు తెలుపుచున్నవి.

పద్మపురాణే.

పద్మపురాణమున

శ్లో॥ మ్లేచ్ఛదేశే శుభే వాపి
చక్రాంకో యత్ర తిష్ఠతి
యోజనాని తథా త్రీణి
మమ క్షేత్రం వసుంధరే.

ఓ భూదేవి, నా చక్రముచే నంకితుడైన వాడు ఏ దేశమందు వసించునో, అట్టి మ్లేచ్ఛులుండు దేశమే గాని లేక శుభప్రదేశమే గాని, అట్టిది మూడు యోజనముల వరకు నా క్షేత్రమే యని తెలుసుకొనుము.

,, అన్యం దేవం పరత్వేన
వదం త్యజ్ఞాన మోహితాః
నారాయణా జ్జగన్నాథాత్
తే వై పాషండిన స్స్మృతాః.

నారాయణుడే జగన్నాథుడు. ఇందులకు విరుద్ధముగా తదితర దేవతలను పరదేవులుగా ఎవ్వరైతే అజ్ఞాన మోహితులై చెప్పుదురో అట్టివారే పాషండులనబడుదురు.

,, శంఖచక్రోర్ధ్వ పుండ్రాది
చిహ్నైః ప్రియతమైర్హరేః
గర్హితా యే ద్విజా దేవి
తే వై పాషండిన స్స్మృతాః.

ఓ భూదేవి, శ్రీహరికి శంఖ-చక్ర-ఊర్ధ్వ పుండ్రాది చిహ్నములు ప్రియతమములైనవి వానిని నిందించువారు ద్విజులైనను కూడ పాషండులనియే చెప్పబడుదురు.

,, ఏవ ముక్త్వా విధాతారం
దేవదేవో హరిః పితా
స్వచక్రేణాంక యిత్వా తం
తస్య మంత్ర మదా త్స్వయం.

దేవదేవుడును, తండ్రియునగు శ్రీహరి చతుర్ముఖ బ్రహ్మను గూర్చియిటులపలికి పిమ్మట అతనికి తనచక్రముచే ముద్రనుంచి తానే స్వయముగ మంత్రముపదేశించెను.

,, సర్వలోకేశ్వరో దేవో
బ్రహ్మా మమ పితా ప్రభుః
మమాపి విధివన్మంత్రం
ప్రదదే మునిసత్తమాః.

ఓ మునిపుంగవులారా!
సర్వలోకేశ్వరుడును, దేవుడును, తండ్రియు ప్రభువునగు బ్రహ్మ నాకును కూడ విధ్యుక్తముగ మంత్రము నుపదేశించెను.

శ్లో॥ తస్మా ద్యూయం మునిశ్రేష్ఠాః
ధారయధ్వం సుదర్శనం
అహం చ ఋషయ స్సర్వే
హ్యగస్త్యాత్రిమునీశ్వరాః
సర్వేదేహవిశుద్ధ్యర్థం
ధారయామ స్సుదర్శనం

ఓ మునిశ్రేష్ఠులారా, గావున మీరు కూడ సుదర్శన చక్రమును ధరింపుడు నేను, ఋషు లందరును, అగస్త్యుడు, అత్రి మున్నగు మునీశ్వరులున్ను అందరము దేహపరిశుద్ధి నిమిత్తమై సుదర్శనచక్రమును ధరించు చున్నాము.

,, సుదర్శనే నాంకితబాహుమూలాః
తథోర్ధ్వపుండ్రాంకితసర్వగాత్రాః
మాలారవిందాక్షధరా శ్చ శుద్ధాః
రక్షంతి లోకాన్ దురితాఘసంచయాత్

ఎవరైతే సుదర్శన చక్రముచే చిహ్నితమైన భుజముల కలిగియున్నారో మరియు శరీర మందంతటను ఊర్ధ్వపుండ్రముల ధరించు చున్నారో, పద్మ - తులసీ పూసలమాలికల ధరించుచున్నారో అట్టివారుపాపపురాశి నుండి లోకమును రక్షించుచున్నారు.

,, అచక్రధారీ యో విప్రః
శ్రుతి - స్మృతి - సమన్వితః
త్యజే చ్చండాలభాండస్థ
సుధావద్దూష్యతే సదా.

ఎవడైతే విప్రుడై, వేద–వేదాంగవేత్తయై కూడ చక్రాంకితుడుగాకయుండునో అట్టి వాడు చండాలుని భాండమునందున్న అమృతమువలె ఎప్పటికిని దూష్యుడే యగు చున్నాడు

పాంచరాత్రే,

పాంచరాత్రమునందు

, తాపాదిపంచసంస్కారాః
ప్రపన్నస్య విశేషతః
ప్రత్యంగాని విజ్ఞేయాః
వశిష్ఠాద్యై శ్చ యోగిభిః

ప్రపన్నుడైనవానికి తప్తచక్రాంకనము ఊర్ధ్వ పుండ్రము – దాస్యనామము – అష్టాక్షరి మంత్రోపదేశము – తిరువారాధనము తప్పకయుండవలెనని వశిష్ఠాదులచే తెలుపబడినవి.

,, సర్వార్తప్రపన్నానాం
దృప్తానాం వేదమార్గిణాం
దేవాదీనాం ఋషీణాం చ
భవే త్సత్యం చతుర్ముఖ.

ఓ చతుర్ముఖా, వేదమార్గాను వర్తను లగు ఆర్తప్రపన్నులకును, దృప్త ప్రపన్ను లకును, దేవాదులకును, ఋషులకును,

శ్లో॥ వైఖానస ద్విజానాం చ
కుర్యాత్తన్నిత్యం చతుర్ముఖ
విష్ణుపూజాది సిద్ధ్యర్థం
పంచసంస్కార ముత్తమం.

వైఖానస ద్విజులకును, విష్ణుపూజాదులు సిద్ధించుటకు పంచసంస్కారములు నిజముగ ఉత్తమములైనవిగాన తప్పక వాటిని పొందవలశినది.

పరాశరసంహిత – విష్ణుపరమధర్మే 4 అధ్యాయే

పరాశర సంహితలో – విష్ణుపరమధర్మమందు

,, అనంతో వైనతేయశ్చ
రథా వైఖానసాదయః
ఏతే ప్రపత్తి నిష్ఠాశ్చ
పంచసంస్కార సంయుతాః.

అనంతులు – గరుడాళ్వార్లు – అవిధముగనే వైఖానసులు మున్నగు వారందరును ప్రపత్తి నిష్ఠులే. పంచసంస్కారసంపన్నులే అయియున్నారు.

(3 అధ్యాయే)

శ్లో॥ అనంకిత స్తు యో మోహాత్
కామాన్మోక్షార్థ మాదరాత్
అర్చయే న్మాం వేదయుక్తం
స చండాలో భవేద్ధ్రువం.

చక్రాంకితుడు గాకుండగ మోహమువలన గాని కామము వలనగాని మోక్షము నిమిత్తమైనన్ను వైదికముగనే అర్చించినను, అట్టివాడు నిశ్చయముగ నింద్యుడే యగుచున్నాడు

శ్లో॥ స చ దేవలకో నామ
సర్వకర్మ - బహిష్కృతః
స యాతి నరకం ఘోరం
తస్యాయుశ్శ్రీశ్చ నశ్యతే.

అట్టివాడు దేవలకుడనబడును ఎట్టి కర్మకును అర్హతలేనివాడగును. ఘోర నరకమును పొందును. అట్టివాని ఆయువు, సంపదయు, నశించును.

,, పుత్రోత్పత్తి – ముహూర్తం వై
బ్రాహ్మణా స్సద్ద్విజాతయః
తాపసంస్కారవిధినా
శంఖచక్రం సదా శుచిం

బ్రాహ్మణులైన ద్విజులు పుత్రుడు జనించినపుడు, సదా శుచిర్భూతములైయుండు శంఖ చక్రములను తాపసంస్కారవిధినను సరించి లఘువుగ తప్తముల గావించి.

,, కృత్వా తప్తం లఘుతరం
సార్భకం శ్వేత మృత్స్నయా

పిల్లవానికి లఘువుగ ముద్రింపించవలయును. పిమ్మట తడిశ్వేతమృత్తికచే (తిరుమణిచే)

ఊర్ధ్వపుండ్రం తథా కృత్వా
జాతకర్మ సమాచరేత్.

ఊర్ధ్వపుండ్రమును ధరింపజేసి జాతకర్మను జరుపవలయును.

శ్లో॥ మౌంజీబంధనకాలే తు
పంచసంస్కారమార్గతః
కుర్యా ద్గురు పితా వాథ
తప్తచక్రాది ధారణమ్.

పిల్లవాని ఉపనయనకాలమునందు మౌంజీ బంధనానంతరమున గురువుగాని తండ్రిగాని పంచసంస్కార విధానముగ తప్తచక్రాంకన మొనరింపవలెను.

,, ద్విజ కర్మాది సిధ్యర్థం
విష్ణుసాయుజ్య హేతవే॥

దానివలనమాత్రమే ద్విజకర్మాదులు సిద్ధించును. శరీరవియోగానంతరమున శ్రీ విష్ణు సాయుజ్యము లభించగలదు.

పద్మే

పద్మపురాణమునందు

,, అర్చనం మంత్రపఠనం
యాగం యోగ మథాత్మనః
నామ సంకీర్తనం సేవా
తచ్చిహ్నైరంకనం తథా.

శ్రీవిష్ణుమూర్తియొక్క అర్చనము, ఆయన యొక్క మంత్రమును పఠించుట, ఆయన యొక్క ఆరాధనా రూపయాగము, ఆయన యొక్క ఉపాసనము, ఆయనయొక్క నామ సంకీర్తనము, ఆయనయొక్క కైంకర్యము, ఆయనయొక్క అసాధారణచిహ్నములైన శంఖ చక్రముల ధారణము, ఆయనయొక్క భక్తులయొక్క ఆరాధనము,

,, తదీయారాధనం ధ్యానం
నవధా తస్య తే శుభే
నవకర్మ విధానేజ్యా
విప్రస్య సతతం స్మృతం.

ఆయనయొక్కధ్యానము అనునవి తొమ్మిదియు తొమ్మిదివిధానములైన సంతతకైంకర్యములుగ విప్రునికి విధింపబడి యున్నవి.

,, ఉపవీతం శిఖాబంధం
ఊర్ధ్వపుండ్రం తథైవ చ
చక్రలాంఛనహీనస్య
విప్రస్య విఫలం భవేత్.

ఉపవీతముగాని శిఖాబంధముగాని, ఊర్ధ్వ పుండ్రముగాని చక్రలాంఛన విహీనుడైన విప్రునకు విఫలమే యగుచున్నవి.

పాద్మే. —

,, వినా యజ్ఞోపవీతేన
వినా చక్రస్య ధారణాత్
వినా ద్వయేన యో విప్రః
చండాలత్వ మవాప్నుయాత్.

పద్మపురాణమందు

యజ్ఞోపవీతము లేకపోయినను, చక్రధారణము లేకపోయినను, ద్వయమంత్రోపదేశము లేకపోయినను విప్రుడు వ్యర్థుడే యగుచున్నాడు.

వృద్ధపరాశరస్మృతౌ,

,, దక్షిణే తు భుజే విప్రో
బిభృయాద్వై సుదర్శనమ్
సవ్యే తు శంఖం బిభృయాత్
ఇతి బ్రహ్మవిదో విదుః.

వృద్ధపరాశరస్మృతియందు

విప్రుడైనవాడు తప్పక దక్షిణభుజమునందు సుదర్శనచక్రచిహ్నమును, ఎడమభుజమునందు శంఖ చిహ్నమును ధరించవలయునని బ్రహ్మవేత్తలు తెలుపుచున్నారు.

వైఖానసాగమే - ప్రార్థనసమయే.

,, సూత్రం వైఖానసం వందే
భగవత్కర్మ సూచితమ్
నారాయణః పితా యస్య
యస్య మాతా హరేఃప్రియా
భృగ్వాది మునయ శ్శిష్యాః
తస్మై శ్రీవిఖనసే నమః

శంఖచక్రధరం దివ్యం
శుద్ధజాంబూనదప్రభం
కర్మారంభం కరిష్యామి
నత్వా విఖనసం మునిం॥

వైఖానసాగమమున - ప్రార్థనసమయమున.

భగవంతుని యారాధనను సూచించునట్టి వైఖానస సూత్రమునకు నమస్కారము. అట్టి సూత్రకారుడై, శ్రీమన్నారాయణుని కుమారుడై, శ్రీ లక్ష్మీ దేవి పుత్రుడై భృగ్వాది మునులయాచార్యుడైన శ్రీ విఖనసమునికి నమస్కారము.

శంఖచక్ర ధారుడైన, ప్రకాశవంతుడైన మేలిమి బంగారువర్ణుడైన శ్రీవిఖనసమునికి నమస్కరించి శ్రీభగవదారాధనమును ప్రారంభించుచున్నాను.

స్కందపురాణే.

పూర్వాయాం సనత్కుమార సంవాదే సన త్కుమారః.

శ్లో॥ వృత్రేణ విజితా స్సర్వే
పురాదేవా స్సదానవాః
బ్రహ్మాదయో గతాః భూప
శంకర ప్రముఖా స్తతః.
త్రాహిత్రాహి జగన్నాథ
వృత్రేణ విజితా వయం

శ్రీ భగవాను వాచ

,, మదాయుధాని దేహేషు
లాంఛయిత్వా సురోత్తమాః
యుధ్యతాం సమరే దైత్యా
మత్ప్రసాదేన భూయసా.

,, మదాయుధాంకితాన్ దృష్ట్వా
భవత స్సురశత్రవః
క్షయం యాస్యంతి సమరే
మత్ప్రసాదా త్సురేశ్వరాః.

,, ప్రణమ్య దండవ ద్భూమౌ
బ్రహ్మరుద్రపురోగమాః
హత్వా వృత్రం గతా దేవాః
స్వస్థానం చ ముదాన్వితాః.

స్కందపురాణమున

పూర్వము సనత్కుమార సంవాదమున సనత్కుమారుడిటుల తెలిపెను.

పూర్వకాలమున సమస్త దేవతలును దానవులతో కూడ వృత్రాసురునిచే జయింపబడిరి. అపుడు ఓ రాజా బ్రహ్మాదులును, శంకర ప్రముఖులును శ్రీమహావిష్ణువువద్దకు వెళ్లి ఓ జగన్నాథ! మేమందరము వృత్రాసురునిచే ఓడింపబడితిమి "మమ్ములను కాపాడుము. మమ్ములనుకాపాడుము" అని ప్రార్థించిరి.

అపుడు భగవంతు డిటులపలికెను.

ఓ దేవతలారా! నాయొక్క శంఖ - చక్రాయుధములను మీరు మీదేహములయందు ముద్రింపజేసుకొని యుద్ధమాచరింపుడు, నా యొక్క యనుగ్రహావిశేషముచే యుద్ధమునందు రాక్షసులు,నా యాయుధములచే చిహ్నితులైన మిమ్ములను జూచి నాశనమును జెందగలరు.

బ్రహ్మ రుద్రుడు మున్నగు దేవతలందరును శ్రీమన్నారాయణునికి సాష్టాంగప్రణామము లాచరించి ఆయన యాజ్ఞానుసారముగ శంఖ చక్ర లాంఛనులై యుద్ధమున వృత్రాసురని చంపి సంతోషముతో స్వస్థానము పొందిరి

హారీతస్మృతౌ

శ్లో॥ దీక్షితః పంచసంస్కారైః
మంత్రరత్న - పరిగ్రహః
స ఏవ బ్రాహ్మణో లోకే
దేవానా మపి వందితః.

హారీతస్మృతియందు

తాప పుండ్రం తథానామ మంత్రోయాగశ్చ యను పంచసంస్కారములచే దీక్షితుడై మంత్రరత్నము నుపదేశము నొందినవాడు మాత్రమే లోకములో బ్రాహ్మణుడనబడ జాలును దేవతలకు కూడ నమస్కారార్హు డగును

,, బ్రాహ్మణః క్షత్రియా వైశ్యాః
శూద్రశ్చ శ్రద్ధయాన్వితః
చక్రం చ పాంచజన్యం చ
బిభృయా దగ్నిసంయుతం.

బ్రాహ్మణుడే గాని, క్షత్రియుడేగాని, వైశ్యుడేగాని శూద్రుడే గాని, అగ్నియందు తప్తము గావింపబడిన శంఖ - చక్రములను ధరించవలసినది

,, అచక్రధారిణో విప్రాః
సర్వకర్మసు గర్హితాః
అవైష్ణవత్వ మాపన్నాః
నరకం యాంతి నిశ్చయం.

శంఖచక్రముల ధరించనట్టి విప్రుడు ఏకర్మ కును పనికిరాడు- అట్టివాడు అవైష్ణవుడే యగుచున్నాడు. తప్పక నీచగతినే పొంద గలడు.

వ్యాసస్మృతౌ

,, యజ్ఞోదానం తపోహోమ
భోజనం పితృతర్పణం
చక్రలాంఛన హీనస్య
విప్రస్య విఫలం భవేత్.

వ్యాసస్మృతియందు

యజ్ఞము - దానము - తపస్సు- హోమము భోజనము - పితృతర్పణము - ఇవి చక్రలాంఛితుడుగానట్టి విప్రునికి ఫలింపజాలవు

,, అచక్రధారిణం విప్రం
య శ్శ్రాద్ధే భోజయిష్యతి
రేతో మూత్ర పురీషాది
స పితృభ్యః ప్రయచ్ఛతి.

చక్రధారిగాని విప్రుని ఎవడు పితృశ్రాద్ధ మున భుజింపజేయునో అట్టివాడు పితృదేవ తలను సక్రమముగ నారాధించినట్టివాడు కాజాలడు.

శ్లో॥ తస్మా చ్చక్రం విధానేన
తప్తం వై ధారయే ద్ద్విజః.

కావున ద్విజుడు యథావిధిగ తప్తమైన చక్రమును ధరించవలయును.

,, ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ
విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా
స్వరేణ మంత్రేణ సదా హృది స్థితం
పరాత్పరం యన్మహతో మహాంతం

ఊర్ధ్వపుండ్రధారియై, శంఖచక్రలాంఛితుడై, ఎల్లపుడును హృదయమునందే యుండు పరాత్పరుడైన మహామహుడైన శ్రీ మహావిష్ణువు నెవడైతే ధ్యానము చేయునో అట్టివాడే మహాత్ముడగుచున్నాడు.

,, శంఖచక్రోర్ధ్వ పుండ్రాదీన్
ధారయే ద్బ్రాహ్మణ స్సదా
శ్రాద్ధాది సర్వకర్మార్హః
ఇత్యుక్తం కిమతః పరం.

శంఖచక్రములు- ఊర్ధ్వపుండ్రములు సదా ధరించియుండు బ్రాహ్మణుడు మాత్రమే సర్వకర్మార్హుడగుచున్నాడని చెప్పబడుచున్నది. ఇంతకంటెను వేరెయుపాయములేదు.

,, తదాప్రభృతి దేవాద్యాః
సర్వేదేవా స్సవాసవాః
ఋషయ స్సిద్ధగంధర్వాః
పాతాళే పన్నగేశ్వరాః

అప్పటినుండియును దేవేంద్రునితోసహా ప్రధానులగు దేవతలందరును, ఋషులును, సిద్ధులును, గంధర్వులును, పాతాళమందలి పన్నగేశ్వరులును.

,, వహ్నౌ స్తప్తం హరే శ్చక్రమ్
శంఖం చైవ విధానతః
ధారయంతి ముదాయుక్తాః
శత్రో ర్విజయకాంక్షిణః.

అగ్నియందు తప్తమును గావింపబడిన శ్రీ విష్ణుచిహ్నమగు చక్రమును, శంఖమును, యథావిధిగ సంతోషముతో కూడుకున్నవారలై, శత్రువుల యొక్క విజయమును కాంక్షించుచున్నవారలై ధరించుచున్నారు

,, తస్మా త్త్వ మపి రాజేంద్ర
కురు కృష్ణాయుధాంకితమ్
స్వదేహం నిజసజ్గ్రామే
హ్యజేయ స్త్వం భవిష్యసి
కృష్ణచక్రాజ్కితో భూత్వా
సజ్గ్రామం ప్రవిశేద్యది
విజిత్య చరిపూన్ సర్వాన్
స్వదేశం ప్రాప్నుతే నృపః.

కావున ఓ రాజేంద్ర! నీవుకూడ శ్రీకృష్ణాయుధములగు శంఖు చక్రములచే చిహ్నితుడవు కావలశినది.

ఓ రాజా! నీవుకూడా శ్రీకృష్ణచిహ్నములగు శంఖ చక్రములను నీ దేహమున ధరించినచో నీవు అజేయుడవై సమస్త శత్రువులను జయించి స్వదేశమును పొందగలవు.

ప్రశ్నోత్తరఖండే.

శ్లో॥ విధినా శంఖచక్రాది
ధారణం చోర్ధ్వపుండ్రకమ్
ఉపవీతం శిఖాబంధమ్
విప్రస్య సతతం స్మృతమ్.
,, చక్ర - లాంఛన హీనస్య
ద్విజత్వం నిష్ఫలం భవేత్.

ప్రశ్నోత్తరఖండమునందు.

విధ్యుక్తముగ శంఖ చక్రాదులను ధరించుటయును, ఊర్ధ్వపుండ్రమును, ఉపవీతమును, శిఖాబంధనమును విప్రునికి ఎల్లప్పుడును యుండవలయును. చక్రలాంఛనవిహీనుడైనవానికి ద్విజత్వము నిష్ఫలమగుచున్నది.

పాంచరాత్రే.

,, వైష్ణవత్వస్య సిద్ధ్యర్థం
జ్ఞానసిద్ధ్యై విశేషతః
ప్రతప్తే చ్ఛంఖచక్రాభ్యాం.
హుత్వాహోమం విధానతః.
అన్యై ర్నదావయేద్గాత్రం
బ్రాహ్మణో హరిలాంఛనైః

పాంచరాత్రమున.

వైష్ణవత్వసిద్ధికొరకును, విశేషించి జ్ఞానసిద్ధికొరకును, యథావిధిగ అగ్నియందు హోమమాచరించి, అందు తప్తమాచరించిన శంఖచక్రములచే బాహువులయందు అంకనమాచరింపవలెను.
విష్ణువుయొక్క ఇతరచిహ్నములు దేనిచేతను శరీరమున తాపసంస్కారమాచరించరాదు

బ్రాహ్మే.

అహం చ ఋషయ స్సర్వే
హ్యగస్త్యాత్రి మునీశ్వరాః
సర్వే దేహవిశుద్ధ్యర్థమ్
ధారయామ సుదర్శనమ్.

చక్రాంకితభుజా స్సర్వే
ప్రహ్లాదేన ధ్రువేణ చ
విభీషణేన బలినా
రుక్మాంగద శుకేన చ.
,, మాంధాత్రాంబరీషేణ
మార్కండేయ ముఖై ర్బుధైః.

బ్రహ్మపురాణమున.

బ్రహ్మ యిట్లుల తెలిపెను. నేనును, అగస్త్యుడు, అత్రిమునీశ్వరుడు మున్నగు ఋషులందరును కూడ దేహపరిశుద్ధికొరకై సుదర్శనమును ధరించుచున్నాము

ప్రహ్లాదునిచేతను, ధ్రువునిచేతను, విభీషణునిచేతను, బలిచేతను, రుక్మాంగదునిచేతను శుకునిచేతను, మాంధాతచేతను, అంబరీషునిచేతను, మార్కండేయునిచేతను, ఇంకను ముఖ్యులగు పెద్దలచేతను, భుజములయందు చక్రాంకనము లాచరింపబడియున్నవి.

రహస్యామ్నాయబ్రాహ్మణే.

శ్లో॥ తదా విష్ణుర్లక్ష్మై త్రియ
శ్రీమద్ద్వయ ముపదిదేశ
దేవీచేమాం బ్రహ్మవిద్యాం
సాంగాం సరహస్యాం
విష్వక్సేనా యోపదిదేశ
విష్వక్సేనోఽమృతతీర్థే
ఐరమ్మదీయే తటాకే
సోమవసనాఖ్యాశ్వత్థ
చ్ఛాయాయాం వైనతేయో
పహృతాం శ్వేతాం మృత్స్నాం
శంఖచక్రోర్ధ్వపుండ్రం
దాస్యేమంత్రోయాగం చేతి
పారమైకాంతికాణ్ ధర్మాన్
బ్రహ్మాణం ధారయన్
బ్రహ్మ సనత్కుమారం
సనత్కుమారేణ నారదః
నారదో వ్యాసం వ్యాసోబ్రుహత్సేనం
శుకంచేతి ఇద ముపనిషదిమ్.

రహస్యామ్నాయబ్రాహ్మణమునందు.

శ్రీవైకుంఠమున శ్రీమహావిష్ణువు లక్ష్మి కొరకు శ్రీమద్ద్వయ మంత్రము నుపదేశించెను, ఆమె ఈ బ్రహ్మవిద్యను అంగములతో రహస్య విషయములతో కూడను, విష్వక్సేనుల కొరకు ఉపదేశించెను. విష్వక్సేనులు అమృతతీర్థమున ఐరమ్మదీయమను తటాకమున సోమవసనమను పేరుగల అశ్వత్థఛాయయందు వైనతేయులచేత గొని రాబడిన శ్వేత మృత్తికచేత ఊర్ధ్వపుండ్రమును, శంఖచక్రలాంఛనములను, దాస్యనామమును, ద్వయమంత్రమును, తిరువారాధనమును పరమైకాంతి లక్షణములగు ఈ పంచ సంస్కారములను చతుర్ముఖబ్రహ్మ కనుగ్రహించెను. పిమ్మట బ్రహ్మ సనత్కుమారునికిని సనత్కుమారుడు నారదునకును, నారదుడు వ్యాసునకును, వ్యాసుడు బ్రుహత్సేనునకును, శుకునకును దీని ననుగ్రహించెను.

ఈ చక్రాంకణములన్నిటిని పాఠకుల సౌకర్యార్థమై ఉపన్యాస భూషణ బిరుదాంకితులైన శ్రీమత్తిరుమల కాండ్యూరు విద్వాన్ రామానుజాచార్యులవారిచే ఉదాహరణములతో శ్లోక రూపముగ సంగ్రహింపబడి సుదర్శనవైభవమను పేరుతో ప్రకటింపబడెను. ఆ శ్లోకములు కొన్ని యిచ్చట తాత్పర్యముతో పరిచురింపబడుచున్నవి :—

## సుదర్శన వైభవము

1. సుదర్శన సముద్రాఙ్క-
ధారణం శ్రుతిచోదితమ్।
అతప్తతనో రిత్యాది
శ్రుతి ర్యజుషి సూచ్యతే॥

1 చక్రాంకణము వేదమునందు విధింపబడినది. 'అతప్తతనో'రనెడు వాక్యము యజుర్వేదమునగానబడును.

2 తస్యాం శ్రుతౌ తనో రర్థః
ఉపబృంహణతో భుజః।
ఇద్వహస్త ఇతి శ్రుత్యా
తదఙ్కధరణం భుజే॥

2 ఆ వేదవాక్యమునందలి తను శబ్దమునకుప బృంహణ వాక్యాధారమున భుజమని యర్థమును జెప్పవలెను 'ఇద్వహస్త' యనెడు శ్రుతి వాక్యము చేతనుకూడ ఆ చక్రాంకణముభుజమునందేయనిస్ఫుటమగుచున్నది.

3 పవిత్రంత ఇతి శ్రుత్యాః
వినియోగోఽన్యదాకృతః।
కథం సుదర్శన ఙ్కస్య।
ధారణేఽసౌ నియుజ్యతే॥

3 'పవిత్రంతే' యనెడు శ్రుతివాక్యము మరియొక కర్మయందు వినియోగింప బడుచున్నదే చక్రాంకణవిషయమున దీనికి వినియోగమెట్లనిన?

4. అన్యత్ర వినియుక్తాం హి
'గంధ ద్వారేతి' చ శ్రుతిమ్।
వినియుఞ్జన్తి దానే తు
చందన స్య చ వైదికాః॥

4 ఇతరత్ర వినియోగింపబడు "గంధద్వార" యనెడు శ్రుతినివైదికులు చందనమొసంగుటలో నుపయోగించుచున్నారుగదా! యట్లే యిదియును

5. అవ్యక్తోపనిషద్ప్రోక్తే
సుదర్శన సుధారణమ్।
బ్రహ్మా సుదర్శనే నేన్ద్రం
సచ్చక్రేఙ్కిత మిత్యహో॥

5 బ్రహ్మయును దేవేంద్రుని గూడ చక్రాంకితుని గావించెనుగాన యెల్లరును చక్రాంకితులు కావలెనని అవ్యక్తోపనిషత్తు చెప్పుచున్నది.

6 ఇత్థం తు శ్రుతయశ్చాన్యాః
చక్రాఙ్కన విధిం ప్రతి
బ్రువతే శ్రుతి కర్తారః
శాణ్డిల్యాద్యా మహర్షయః॥

6 ఇట్లనేకములగు నితరశ్రుతులున్ను చక్రాంకనమును విధించుచున్నవని. శ్రుతి కర్తలగు శాండిల్యాది మహర్షులు చెప్పుచున్నారు.

7 బృహస్పతి రపి బ్రూతే
స్వస్మృతౌ జనితం సుతమ్।
హేమ సౌదర్శనాకార
చిహ్నితం కారయే త్త్వితి॥

7 బృహస్పతియు తానురచించిన ధర్మశాస్త్రమున పుట్టిన బిడ్డను సువర్ణసుదర్శనముచే చిహ్నితుని గావించవలెనని సెలవిచ్చెను

8. పశు పుత్రాదికం సర్వం
గృహోపకరణాని చ।
అఙ్కయే చ్ఛఙ్ఖ చక్రాభ్యా
మితి శాణ్డిల్య సుస్మృతౌ॥

8 పశుపుత్రాదులను, ఇంటియందు నిత్యము వాడుకొను వస్తువులనుకూడ శంఖచక్రములచే గుర్తించవలెననిశాండిల్యమహర్షి తన గ్రంధమున నుడివెను

9 చరణేన పవిత్రేణ
చమూషశ్చ్యైన తోఽపివా।
వైష్ణవీభి శ్చ ఋగ్భి శ్చ
చక్రేష్టిం కారయే త్త్వితి॥

9 'చరణం' అను మంత్రముచేగాని 'పవిత్రం' అను మంత్రముచేగాని 'చమూష'స్సనెడు మంత్రముచేతనైనను గాని ఇతర వైష్ణవ ఋక్కులచేతనుగాని చక్రాంకణమును జేయవలెను

10 వైఖానసే కాశ్యప స్తు
బ్రూతే చక్రాఙ్కన క్రమమ్
నిస్సంశయం విశేషేణ
శ్రౌత స్మార్తార్య సమ్మతమ్॥

10 అని వైఖానసాగమమున కాశ్యప మహర్షి చక్రాంకన క్రమమునుభోధించెను. కావున నీ చక్రాంకనము ముఖ్యముగ శ్రుతి స్మృతి శిష్టాచారసమ్మతమనుట నిస్సంశయము

11 ఏవం శ్రుతిషు సువ్యక్తం
చతు ర్షు స్మృతిషు స్ఫుటం।
వైఖానసే పాఞ్చ రాత్రే
జ్ఞాయతే చక్ర లాఞ్ఛనమ్॥

11 ఇట్లు సకల వేదములయందును నాలుగు స్మృతులయందును వైఖానస పాంచరాత్రాగమములయందును చక్రాంకణము ప్రమాణీకరింపబడుచున్నది.

12 కశ్యపో విఖన శ్శిష్యః
తప్త ముద్రా మువాచ సః।

12 విఖనస ఋషిశిష్యుడు కశ్యపమహర్షి. అతడు తప్త చక్రధారణమును విధించెను కావున

తప్తముద్రా విహీనా యే
తదాజ్ఞోల్లఙ్ఘినస్తుతే॥

నట్లు చక్రాంకితులుకానివారు ఆయనయాన దాటినవారే గదా!

13 భారతం పఞ్చమో వేదః
నానా భాషాసు భాషితమ్।
పాఞ్చరాత్రంతు తత్రాస్తే
నారాయణ కృతం స్వయమ్॥

13 అనేక భాషలలో ననువదింపబడిన పంచమ వేదమనంబడు భారతమున నారాయణునిచే స్వయముగ నుపదేశింపబడినపాంచరాత్రము గలదు.

14 తస్య ప్రవర్తనే ముఖ్యాః
భృగు శ్చాత్రి శ్చ కాశ్యపః।
మరీచి రితి సువ్యక్తాః
భారతే భాషితా ఇమే॥

14 అట్టి పాంచరాత్రాగమ ప్రవర్తకులలో ప్రధానులు భృగు, అత్రి, కాశ్యప, మరీచు లనెడుమహర్షులేయని భారతమునస్పష్టముగ నుదహరింపబడెను.

15 పాఞ్చరాత్రాగమే ష్వేషః
తప్తముద్రా పరిక్రమః।
ఆరాధక పరిగ్రాహ్యాః
కదితః పరమాత్మనా॥

15 ఆ పాంచరాత్రాగమములయందు తప్త ముద్రాధారణము అర్చకుల కత్యంతావశ్యకమని పరమాత్మచే జెప్పబడెను.

16 ప్రవర్తకాస్తు తత్రాపి
తప్తముద్రా విధిం ప్రతి।
భృగ్వాద్యామునయ శ్చాత్ర
కథం తే తన్ని వర్తకాః॥

16 తప్తచక్రాంకణ ప్రవర్తకులగు భృగ్వాది మునిపుంగవులే చక్రాంకణ నివర్తకులెట్లగుదురు?

17 భీమం ప్రోవాచ హనుమాన్
భారతే వనపర్వణి।
కృతయుగే జనా స్సర్వే
కృతలక్షణ లక్షితాః॥

17 భారతమందలి వనపర్వమున హనుమంతుడు భీమునితో కృతయుగమున ప్రజలందరును చక్రాంకితగాత్రులుగను,

18 నారాయణ స్త్వేక ఏవ
సర్వైర్ధ్యేయః కృతేయుగే
ఏకదేవ సమాయుక్తా
ఏకమన్త్రా జనా ఇతి॥

18 ఏకైక నారాయణధ్యాన తత్పరులుగను, ఒకే అష్టాక్షరీ మంత్రమును మాత్రమే జపించువారుగను ఉందురనిపలికెను.

19 భీష్మపర్వణి భీష్మస్తు
కృతలక్షణ మాహ చ
సర్వేజనా స్సమభవన్
కృతలక్షణ లక్షితాః
ఇత్యత్ర క్రియయా సర్వే
కృతలక్షణతాయుతాః

19 భీష్మ పర్వమునందు భీష్ముడు కృతలక్షణులనగా చక్రాంకణ మనెడు క్రియారూప లక్షణముతో లక్షితులని వివరించెను.

20 కేచిద్వదన్తి చాత్రైవ
శూద్రాస్స్యుః కృతలక్షణాః
హనూమత స్తదుక్త్యా తు
సర్వేచ కృతలక్షణాః

20 కొందరీ ఘట్టమున శూద్రులుమాత్రమే చక్రాంకితులని యందురు కాని పై హనుమంతుని వాక్యమున 'అందరును కృతలక్షణు'లనుటచే శూద్రులుమాత్రమే చక్రాంకితులని చెప్పరాదు

21 సర్వేవర్ణాః కృతయుగే
నారాయణ పరాయణాః
కృతం చ లాఞ్ఛనం యైస్తే
సర్వే చ కృతలక్షణాః
తత్రత్య కృతశబ్దార్థః
న యుగో భీష్మవాక్యతః

21 కృతయుగమున అన్ని వర్ణములవారును నారాయణపరాయణులనియు, కృతలక్షణులనియు చెప్పబడుటచే చక్రాంకణమనెడు క్రియారూప చిహ్నధారులనియే యర్థమని యెఱుంగవలెను అంతియకాని ఇచ్చటి కృతశబ్దమునకు భీష్మవాక్యమునుబట్టి కృతయుగమని యర్థమును జెప్పరాదు.

22 ఉచ్చైశ్చర వసోర్రాజ్ఞః
పాఞ్చరాత్రంతు పాలనే
స వసుః పాఞ్చరాత్రోక్త
చక్రాఙ్కన పరాయణః

22 పాంచరాత్రాగమ పరాయణుడగు ఉపరిచర వసువనెడురాజు పాంచరాత్రమున జెప్పబడిన చక్రాంకణపరుడు.

23 అమ్బరీష శ్చక్రవర్తీ
కాశ్యపోక్త్యాతు తత్పరః
తచ్చిహ్నధారీ తన్మన్త్ర
తద్భక్త్యైక పరాయణః

23 అంబరీషుడను మహారాజు కాశ్యపుడు చెప్పినటుల చక్రాంకితుడై, నారాయణాష్టాక్షరీ నిష్ఠాతుడును, నారాయణప్రియ భక్తుడును ఆయెను.

24 శుక్లం యజుర్వశిష్ఠాద్యైః
మునిభిశ్చ హనూమతా
ప్రాధీతం యాజ్ఞవల్క్యేన
జనకైః రవిణా పునా.

24 శుక్లయజుర్వేదము వశిష్ఠాది ఋషిపుంగవులచేతను, హనుమంతునిచేతను, యాజ్ఞవల్క్యునిచేతను, జనకుడు, సూర్యుడు మొదలగువారిచేతను పూర్వమాదరముతో నధ్యయనము గావింపబడెను.

25 రామోఽపి భగవాన్ కృష్ణః
తం వేదం సమధీతవాన్
వేదే తస్మిం శ్శతపథే
బ్రాహ్మణం పఠ్యతే ద్విజైః.

25 శ్రీరామచంద్రుడును, శ్రీకృష్ణపరమాత్మయు నీ వేదమునధిగమించిరి. ఆ శుక్లయజుర్వేదమందు శతపథ బ్రాహ్మణముకలదు. దానిని విప్రులనుసంధించుచుందురు.

26 తత్ర చక్రబ్రాహ్మణే తు
తప్తచక్రాఙ్కనం శ్రుతమ్
తప్తం చక్రం భుజయుగే
ధార్యమిత్యుచ్యతే ముహుః.

26 అందున్న చక్రబ్రాహ్మణమున రెండు భుజములయందును తప్తచక్రాంకనమును ధరింపవలెనని పెక్కుసారులు తెలుపబడెను

27 తస్య ప్రవర్తకః కణ్వః
తచ్ఛిష్యో భరతో నృపః.

27 ఆ చక్రబ్రాహ్మణమును ప్రవర్తింపజేసిన వాడు కణ్వుడు, ఆయన శిష్యుడు భరత మహారాజు.

28 దౌష్యన్తేః భరతస్యాదౌ
జాతకర్మాది సంస్కృతీః
కణ్వశ్చకార తత్పుత్రః
చక్రవర్తీ భవత్తతః.

28 దుష్యంతుని కుమారుడగు భరతునకు ముందు ముందు కణ్వమహర్షి జాతకర్మాదిసంస్కారములను గావించెను కావున నాతడు చక్రవర్తియాయెను

29 జాతకర్మాది సంస్కారే
ష్వాదిశబ్దేన భారతే
చక్రాఙ్కనాది సంస్కారాన్
చకారేతి సతాం మతిః.

29 జాతకర్మాది సంస్కారములనెడు తావుల ఆది శబ్దముచే చక్రాంకనాది సంస్కారములనుచేయించెనని ప్రాజులందురు

30 తతస్తు చక్రవర్తీ సః
బభూవేతి గిరాఽభవత్

30 అందులకా భరతుడు చక్రవర్తియను పేరుతో ప్రసిద్ధికెక్కెను ఆతడు యువరాజుగ నుండ

తతః పరం యౌవరాజ్యే
భరతస్యాగ్రతో మహత్
లోకసన్నాదనం దివ్యం
చక్రం ప్రావర్తతేతి చ.

గనే లోక విఖ్యాతమగు సుదర్శన చక్రమా
తని సమ్ముఖముననే సంచరింపదొడంగెను.

31 గ్రాహ్యస్స్వ స్సద్గుణా ఏవ
న బహిర్లాఞ్ఛనానిచేత్
కథం యతే ర్ముణ్డనం చ
కాషాయామ్బరదారణమ్॥

31 సద్గుణములచే గ్రహించవలెనుగాని బాహ్యా
చిహ్నలతో పని యేమియన్నచో సన్యాసికి
గుండు, కాషాయములేల?

32 ఆశ్రమా అపి సర్వే చ
లాఞ్ఛనైః కదితా స్స్మృతా.
తథా వైష్ణవ సంస్కారాః
చిహ్నైస్తు కవితాస్స్మృతా

32 బ్రహ్మచర్యాద్యాశ్రమములు నాలుగును
వేరువేరు గుర్తులచేతనే గుర్తించిదగినవని
శాస్త్రకారులు చెప్పినట్లులనే, వీరు వైష్ణవు
లని గుర్తెరుంగుట కీ చక్రాంకణము వైష్ణవ
సంస్కారముగా విధింపబడినది

33 గృహిణీ గుణినీ గ్రాహ్యా
తథా తచ్చిహ్నధారిణీ
గుణా అంతః ప్రీతికరాః
లాఞ్ఛనానిబహిస్తథా,

33 భార్యగుణవంతురాలునుకావలె, గృహిణికి
వలయు గుర్తులు నుండవలె, గుణములు
మనస్సును, గుర్తులు కండ్లనుతృప్తిపరచును

34 హారిద్రాలేపనం సూత్రం
తిలకం కుసుమాని చ
వలయాని సుమఙ్గళ్యాః
సౌమఙ్గల్య సూచకమ్,

34 పసుపూసుకొనుట, మంగళసూత్రమును
ధరించుట బొట్టు,పువ్వులు ముడుచుకొనుట,
చేతికి మురుగులు మొదలు నీ గుర్తులుఈమె
సువాసిని యని తెలుపునవి.

35 ఏతేషా మప్యభావేతు
గుణిన్యామపి తత్పతిః
న తృప్యతి తు కుప్యేత
రూపవత్యా మపి ప్రియః.

35 ఈ గుర్తులే లేనిచో భార్యయెంతగుణ వంతు
రాలైనను ఎంతరూపవతియైనను భర్త ఎంత
మంచి వాడైనను సంతసింపడు సరిగదా
పైగా కోపగించును.

36 ఏవ మేవ భవేద్దేవః
భక్తిమత్యపి వైష్ణవే

36 ఇట్లే భగవంతుడును ఎంతభక్తుడైనను తన
గుర్తులనుధరించనివైష్ణవునంతగ ప్రేమించడు.

స్వలాఞ్ఛనై ర్విహీనేతు
న ప్రీణాతి విశేషతః.

37 తస్మాత్తత్పరమాకార
శఙ్ఖచక్రాది లాఞ్ఛితమ్
భక్తంతు పూజయే న్నిత్యం
తదుక్త్యా తస్య తృప్తయే.

37 కాబట్టి శ్రియఃపతి కసాధారణమగు శంఖ చక్రాది గుర్తులను ధరించిన భక్తుని, భగవంతుని ప్రీతికై భగవంతుడు,విధించినరీతిగనే పూజింపవలెను.

38 ఉపాదిశ త్పాఞ్చరాత్రం
అర్చ్య మర్చక మర్చనమ్।
అర్చ్యం నారాయణం బ్రూతే
తదర్చన మనే కధా॥

38 పాంచరాత్రాగమము అర్చకుడు, అర్చనము,,అర్చింపబడు నారాయణుడు మొదలగునవి యెట్లుండవలెనో పెక్కురీతులుబోధించుచున్నది.

39 అర్చక శ్శఙ్ఖ చక్రాది
లాఞ్ఛితః పూజయే ద్ధరిమ్।
శఙ్కరార్య స్తత్పరతాం
అఙ్గీ చక్రే చ బాష్యకృత్॥

39 అర్చకుడు శంఖచక్రాది చిహ్నాలను ధరించియే శ్రీహరిని పూజింపవలెను.' అని స్పష్టముగ తెలిపెను సూత్రాది భాష్యకర్తయగు శ్రీ శంకర భగవత్పాదులున్నూ ఈ తప్తచక్రాంకణ క్రియను నామోదించిరి.

40 యత్రావ దుచ్యతే యోసా
వితి పఙ్క్తిభి రాహసః
ఉత్పత్త్య సమ్భవా త్సూత్రే
బాష్యే తత్తు ప్రదృశ్యతే॥

40 ఈ విషయము సూత్రభాష్యమందలి"యత్రావదుచ్యతేయోఽసా"అనెడు పంక్తులచేతను "ఉత్పత్త్య సమ్భవాత్"అనెడుసూత్రభాష్యమునందును గాంచనగును.

41 హిమాలయే దృశ్యమాన
నారాయణ పదార్చనమ్।
పాఞ్చరాత్రేణ కుర్వన్తి
శఙ్కరార్య మతానుగాః॥

41 బదరికాశ్రమమునగాన్పించు నారాయణుని పాదములను శ్రీశంకర మతానుయాయులు పాంచరాత్రాగమ విధానము ననే యారాధింతురు

42 స్వ సమ్ప్ర దాయ మఖిలం
నిజ గ్రంధేషు భాష్యకృత్।
నారాయణ పరం వక్తా
కలే రన్యేఽన్య మాశ్రయన్॥

42 భాష్యకారులగు శంకర భగవత్పాదులు నారాయణపరత్వముసే తనసంప్రదాయమని తన గ్రంథములన్నిటిలో నుడివినను తదనుయాయులు రానురానువివాదపడివేరువేరు దేవతల నాశ్రయించిరి

43 శఙ్కరాద్యాః పాఞ్చరాత్ర
దివ్యాగమ పరాయణాః।
పరమ్పరాయా మద్యాపి
పూర్వో నారాయణోఽభవత్॥

43 శ్రీ శంకర భగవత్పాదులు పాంచరాత్రాగమ పరాయణులనుట నిస్సంశయము. వారి యాచార్యపరంపరలో నీ నాటికిని మొదటివాడు నారాయణుడే.

44 ఇతి స్థిరే పాఞ్చరాత్ర
వైభవే వైదికాదృతే।
నాఙ్గీకుర్వన్తి తచ్ఛిష్యాః
తప్త ముద్రాదికం కలేః॥

44 వైదికులందరిచే నేకకంఠముగ నాదరింపబడిన పాంచరాత్రాగమ వైభవమిట్లుండ కలిప్రభావముచే వారిశిష్యులు తప్త చక్రాంకణము నంగీకరింపరు.

45 విశిష్టాద్వైత మద్వైతం
ద్వైతం చేతి మతత్రయమ్।
మతద్వయే విద్యమానాః
చక్రాఙ్కన పరాయణాః॥

45 ద్వైతాద్వైత విశిష్టాద్వైతములను మూడు మతములలో ద్వైతవిశిష్టాద్వైత మతస్థులిరువురును చక్రాంకణము నాదరించువారే (ఇకనద్వైతులు మాత్రము దీనినాదరించుటలేదు)

46 సన్తః కే చిత్తు స్మార్తేఽపి
తత్సంబన్ధ మతానుగాః
చక్రాఙ్కనాది దర్తారః
శ్రేష్ఠ దాస్యావలమ్బినః॥
నియోగా ఇతి కేచిచ్చ
గోలకొండాభిధా పరే।

46 ఆ మతస్థులలోను నియోగులు గోలకొండవారు వెంకటాద్ర్యాహ్వయులు అనువీడదాస్యమే ఉత్తమమైనదని గ్రహించియవలంబించి

47 తప్త ముద్రాది దర్తారో
వేఙ్కటాద్ర్యాహ్వయాః పురా।
రంగక్షేత్రే చ సుమహా
త్కైఙ్కర్య ప్రథితాస్తతాః॥
కర్మణ్యద్వైత సంబన్ధాః।
జ్ఞానే వైష్ణవ సంస్కృతాః॥

47 తప్తముద్రల ధరించుచున్నారు. వారు శ్రీరంగక్షేత్రమున సుప్రసిద్ధ కైంకర్య ధురంధరులు. వైదిక కర్మకాండయందద్వైతసంబంధులుగను జ్ఞానకాండయందు వైష్ణవ దీక్షాధారులుగను నున్నారు

48 ఇత్థం శ్రుతి స్మృతిభ్యాశ్చ
తప్త ముద్రా విధిం ప్రతి।
వైద్యనాథో దీక్షితార్యః
నిబిడ గ్రన్థకే నిజే॥

48 ఇట్లు శ్రుతి స్మృత్యాది ప్రమాణ సిద్ధమగు నీ తప్తచక్రాంకణవిధిని వైద్యనాథ దీక్షితులు, నిర్ణయసింధు గ్రంథకర్తయగు కమలాకరుడును తమ గ్రంథములలో నిందించినట్లు గాన్పించును.

49 నిర్ణయస్య చ సింధౌ చ
నినిన్ద కమలాకరః
భృతకాధ్యాపనే నిందా
యథాపోక్తా తథాత్వయమ్
భృతితో విహితం యత్తత్
నింద్యమాహుర్యథాబుధాః।

49 దానిభావమేమనగా – వేతనమునుగ్రహించి వేదాధ్యయనమును గావించుటెట్లు నింద్యమో అట్లే ధనార్జనకై గావించు పంచసంస్కారములును నింద్యములని తాత్పర్యము.

50 స్వేనైవ కరణే దోషః
ముద్రయా ప్యయసామృదా।
స్వర్ణరాజత తామ్రాది
ముద్రాఙ్కన మనిన్దితమ్॥

50 తానే నిస్స్వార్థముగ గావించినను ఇనుము మట్టి మొదలగువాటితో జేయబడిన శంఖ చక్రములతో చక్రాంకణము గావించుట నింద్యమే. బంగారు వెండి, రాగి మొదలగు వాటితో చేయబడినచో ఏనిందయు లేదు.

51 శఙ్ఖ చక్రాద్యఙ్కనఞ్చ
నృత్త గీతాదికం తథా।
ఏక జాతే రయం ధర్మః
న ప్రాప్య ఇతి నిర్ణయః.

51 చక్రాంకణమున్ను నృత్తగీతాదులున్ను శూద్రులధర్మముగాని ద్విజుల కనాదరణీయ మని పూర్వపక్షులు నుడువుదురు.

52 ఏకజాతే రితి పోక్తేః
పఞ్చమ్యర్థో విదీయతే
తతస్తు వైదికై గ్రాహ్యాః
తప్తముద్రా విధిస్మృతః.

52 ఏకజాతి శబ్దమును పంచమీ విభక్త్యంతముగా నన్వయించిన శూద్రులనుండిబడయ రాదని యర్థమే సిద్ధాంతము కావున తప్తచక్రాంకణము వైదికులవలన పొందదగినదని యానిషేధమునుసమన్వయపరచుకొనవలెను.

53 భృత్యాద్యైర్నిన్ద్యతే తత్తు
భగవద్భజనే న తత్
తథాన చే న్నారదస్తు
సర్వలోక గురుః కథమ్.

53 ఇకనృత్తగీతాది నిషేధమును విమర్శింతము. ఆ నిషేధముజీవనోపాదికై వాటిని వినియోగించువారికే గాని భగవంతుని భజించువారి కానిషేధములేదు. కానిచో నిరంతరము భగవంతుని భజించు నారదుడెట్లు సర్వలోకాచార్యుడనుచున్నాడు?

54 నృత్త గీతాదికం భక్త
లక్షణంతు కథంభవేత్

54 నృత్తగీతాదులెట్లు భక్తుల లక్షణమగును? సజ్జనులెట్లు భక్తి పరవశులై సకల సంసార

సన్తో నృత్యన్తి భక్త్యా తు
విస్మృత్యైవాఖిలం జగత్.

మును మరచి నృత్యమును గావింతురు.

55 ముద్రయా సహితా స్సర్వే
ద్వారకాంప్రవిశన్త్వితి
హరివంశే హరే స్సూక్తిః
ద్వారపానాం చ శాసనే

55 హరి వంశమున శ్రీకృష్ణుడు తన ద్వారపాలకులను చక్రాంకితులను మాత్రమే ద్వారకలో ప్రవేశపెట్టుడని యాజ్ఞాపించెను

56 తప్తముద్రా శఙ్ఖచక్ర
ముద్రైవ విహితా భవేత్.
దృశ్యతే త్వధునా చాపి
పద్మనాభ పురేఽఖిలైః.

56 ఆ శ్లోకమునందలి ముద్రాశబ్దము శంఖ చక్రముద్రయే యని తీర్మానము. ఇప్పటికిని ఆ నగరమునందుందగును చక్రాంకితుల యియేయుందురు

57 సర్వాసు సంహితాసూక్తా
దీక్షా చ పరమాత్మనా
సంహితా దీక్షయా హీనా
న కాచిదపి వర్తతే.

57 భగవంతుడు సంహితలన్నిటియందును వైష్ణవదీక్ష నుపదేశించెను. దీక్షలేని సంహిత యొక్కటియు గానరాదు

58 తప్తముద్రా ధారణంతు
దీక్షాయాం సమ్యగీరితమ్
శ్రౌతేన వైదికానాం సా
పరేషాం తాంత్రికా భవేత్.

58 దీక్షలో తప్తచక్రాంకణధారణము తెప్పగ నుడువబడెను. ఆ దీక్షయు వైదికులకు శ్రుత్యుక్త విధానమునను పరించియును, ఇతరులకు తాంత్రికమును నగుచున్నది

59 పవిత్రాద్యా స్సుశ్రుతయః
వినియుఞ్జన్తి ధారణే
హారీతేన స్మృతౌ ప్రోక్తః
శాణ్డిల్యేన క్రమో హ్యయమ్॥

59 చక్రాంకణమును ధరించుటలో 'పవిత్రం తే' ఇత్యాది శ్రుతులు వినియోగింపబడుచున్నవని హారీతస్మృతియందును శాణ్డిల్యస్మృతి యందును చెప్పబడెను.

60 సచ్చరిత్రరక్షాయాం
వేదాన్తార్యోఽబ్రవీన్మహాన్।
సదాచారసార ఇతి
గ్రన్థోఽస్తి మహితా కృతః॥

60 శ్రీ వేదాంత దేశికార్యులు సచ్చరిత్రరక్షలో జెప్పిరి. పెద్దలు రచించిన 'సదాచారసార'మనెడు గ్రంథమిందులకు ప్రమాణముగానున్నది.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు | పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 54 | | స్త్రైణవత్వ స్వ | స్త్రైణవత్వస్య | | | కణ్వమహష్షి (తా॥) | కణ్వమహర్షి • |
| | | జ్ఞానసిద్ధ్యై | జ్ఞానసిద్ధ్యై | 66 | | ప్రాజులందరు (,,) | ప్రాజ్ఞులందరు |
| | | | | | | బహిర్గ్లానిచ్ఛ (మూ॥) | బహిర్గ్లానిచ్ఛ |
| | | నదావనే | న దాహాయే | | | గుర్తించిదగిన (తా॥) | గుర్తించదగిన |
| 55 | | వ్యాసో | వ్యాసో | | | పసుపూసు (,,) | పసుపుపూసు |
| 61 | | చక్రాంకణము లన్నిటిని | చక్రాంకణ ప్రమాణములన్నిటిని | 67 | | శఙ్ఖచక్రి (మూ॥) | శఙ్ఖచక్రాది |
| | | | | | | పాఞ్చ ( త్రేణ (,,) | పాఞ్చరాత్రేణ |
| 65 | | సుద్ర్శనే | సుదర్శనే | | | నినిన | నినిన్ద |